# మాటవరస



భమిడిపాటి కామేశ్వరరావు



పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# మా ట వ ర స

[మాటవరస (1)—1930

రాజమండ్రి

ఆర్ట్సు కాలేజీలో

22—3—1930 తారీఖున

పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో

శ్రీ ఎడమర్తి జలదుర్గా

ప్రసాద రాయుడు గారి

అధ్యక్షత క్రింద జరి

గినసభలో చదివినది.]

చుట్టా, బీడీ, సిగరెట్.

చుట్టా, బీడీ, సిగరెట్లు త్రిమూర్తులని చెప్పచ్చు. వీటికి జన్మస్థానం ఆయొక్క ఆది విరాట్స్వరూపమైన పొగాకు. ఈరూపాల్లో నేగాక, పొగాకు, అనేకమైన ఇతర ఆకారాలల్లో, భూమిమీద కర్మవశంచేత, అవతారాలు ఎత్తి ఉంది; తను నాశనం అయిపోయి ప్రపంచాన్ని నడిపిస్తోంది. పొగాకు ఇతరులకోసం తగులడిపోతోంది. అదే చుట్టా, బీడీ, సిగరెట్, స్వరూపం! పొగాకు ఇతరుల నిమిత్తం పొడుమైపోతోంది. అదే ముక్కుపొడుం స్వరూపం! (అరవంలో మూకుతూల్ స్వరూపం!) పొగాకు ఇతరులకై, ఎండి, తడిసి, అడ్డమైన నూనెసరుకుతోటీ కలిసి ముక్కముక్కలు అవుతోంది. అదే మసాళా స్వరూపం! పొగాకు ఇతరులకొరకై, సున్నమైనలిగి

పోతోంది. అదే పట్టీ స్వరూపం! పొగాకు ఇతరులకి, శిబిచక్రవర్తికి మల్లే నిజశరీరం కండలు చెండిఇస్తోంది. కొందరు ఉద్యోగులు ఏకచేరీలోనో పనిమధ్యలో ఉండి, దొంటిని జాగ్రత్తచేసి పట్టుగెళ్ళిన పొగాకుముక్క ఆపళంగానే అమాంతంగా కొరుక్కుతింటారు, పటికిబెల్లం తిన్నట్టు. దాన్ని 'కచేరీతాంబూలం' అంటారు—అదే కచేరీతాంబూల స్వరూపం! ఇప్పుడు మనం పొగాకుయొక్క ధూమలక్షణం వెల్లడిచేసే త్రిమూర్తులనీ గురించిమాత్రమే కొంచెంఆలోచిద్దాం (ప్రపంచంలో ఉండే ప్రతీమారుమూలలోనూ పొగాకు మతం వ్యాపించే సెయ్యడానికి ఎక్కువ అవకాశం ఉంది గనక!)

చుట్ట అనేవస్తువు పొగాకుకి తాదాత్మ్యస్వరూపం—అనగా అభేదస్వరూపం. కాని కొందరిమతం వేరు. కొన్ని చుట్టల్లో పొగాకు కాడలు మాత్రమే ఉంటాయనిన్నీ, మరికొన్నింటిల్లో పారేసిన చుట్టపీకెల కళేబరాలుంటాయనిన్నీ, వారియభిప్రాయం. అయినప్పటికీ చుట్టయొక్క పొత్తిపోరాలు ప్రకృతి పురుషులనిన్నీ, వాటిమూలంగా పరమాత్మ కణకణ లాడుతో వ్యక్తమౌతాడనిన్నీ, అందరూ ఒప్పుకుంటారు. బీడీ లోపలిభాగం పొగాకు తుక్కు అయినప్పటికీ, బాహ్యం మాత్రం, వేరేపత్రం,—తునికీ ఆకు, కొండాకచో జిల్లేడు. సిగరెట్టు లోపలి భాగం, అనేక ఓషధుల సాహాయ్యంచేత పొగాకు యొక్క కసటు పోగొట్టుగుని నవ్యసౌరభం ఆర్జించి

కాకితవు దాంపత్యంకలిగి ఉన్న నవీనావతారం. సిగరెట్ స్వరూపం కాక, తక్కిన రెండూ హిందూదేశానికి చెందినవే అని ఒప్పుగోవచ్చు, బీడీ మహామ్మదీయులది, ఆపత్రంకూడా వారిదేశంలోనే దొరుకుతుంది. ఆమాట ఋజువు చేసుగోవచ్చు, పొగాకు అమెరికాలో, ఒక తెల్లఆసామీ ప్రయాణం చేస్తూ కనిపెట్టినట్టు చెబుతారు గాని, వొట్టిమాట! అది ఈ దేశాందే అని చెప్పడానికి అనేక నిదర్శనాలున్నాయి. సోమపానం, ధూమపానం గురించి సెలవిచ్చినట్టే ధూమపత్రం గురించికూడా అనేకమంది ఋషులు స్పష్టంగా, తెగేసి, సెలవిచ్చారు వెనక బాగా చుట్టకాల్చడంచేత ధూమబిరుదు తెచ్చుగున్న ఒకాయనయొక్క సంతతి వాడేట ధౌమ్యుడనేఅబ్బాయి! ఇంకా ఇతర నిదర్శనాలు కావలిస్తే, 'రిసర్చి' చేస్తే, మనకి ఏవిధంగా సాక్ష్యాలుకావాలంటే ఆవిధంగా, రాగిరేకులు, తాళపత్రగ్రంథాలు, నాణాలు వగైరాలు దొరుకుతాయి. మనకి, ప్రతికూలంగా ఉండేవికూడా దొరికితే దొరకవచ్చుగాని అది రిసర్చిగనక వాటిని కప్పిపుచ్చడంలో ప్రత్యవాయువులేదు. అందుకని చుట్టగురించి మన స్వవిషయంలా మాట్లాడుకోవచ్చు. చుట్ట అంటించడానికి పూర్వం చివరకొంచెం పంటితో కొరుకుతారు—చివరమెలెట్టి వుండడం వల్ల ఓచివరనించి ఓచివరికి గాలిలాగటానికి రాధారిలేదేమో అనేభయంచొప్పున. బీడీ వెలిగించడానికి పూర్వం, దాన్ని తల్లకిందులుగా పెదవులలోపలికి పట్టుగుని, పెదవులుబిగించి,

వెలిగించబోయే వేపుకి ఆవిరి పెడతారు—కొంత ఆవిరితడి దానికితగిలి అది హెచ్చు తగ్గులు లేకుండా గుండ్రంగా కాలుకుంటూ రావడానికిన్నీ, లోపల వేంచేసి ఉన్నటువంటి పొగాకు రేణువులు పీల్చే చివర నక్కి ఉండి, బీడీ వెలిగించి ఆదుర్దాగా పీల్చగానే, ఆ మొదటి పీలుపులోనే గొంతుకలో ప్రవేశిస్తాయేమో, వాటికిముందస్తుగా ఉద్వాసన చెప్పకపోతే ఎల్లామరీ, అనే అభిప్రాయంతోటేనీ! సిగరెట్టు ముట్టించడానికి పూర్వం, దాన్ని పుస్తకంలాంటి బల్లపరుపు ప్రదేశంమీద ఉంచి, అరిచేత్తోనొక్కి, ఇటూ అటూ రెండు మూడుసార్లు అప్పడాల కర్రనిమల్లే దొర్లించి, తీసి, పుస్తకాన్నెట్టి, మెల్లిగా తాటిస్తారు—అది లోగడ కట్టుబారి ఉండినట్టయినా పొగ సజావుగా రాకపోతుందేమో అని భయమేసి. ఇలాగ్గా ఈస్వరూపాలు జీవం దాలుస్తాయి. ఈమూడింటిలోకీ బీడీ అదొకమోస్తరు "జంతువు. ఏమాత్రం వ్యవధానం లేక పెద్దపనిలో ఉండి ఒక్కదమ్ము, లిఫ్టులో లాగిపోడానికిమాత్రం టైము సరిపోయే పెద్ద ఉద్యోగస్తులూ కానీకి చాలావస్తాయిగదా ఎప్పుడు పారేసినా పారెయ్యొచ్చు, మనస్సుకేమీబాధలేకుండా—అనుకునే కొద్దివాళ్ళూ, ఎవళ్ళైనా చేయిచాస్తే, క్షోభలేకుండా వాడికి ఓటివ్వొచ్చును—అనే వాళ్ళూ వగైరాలు బీడీసేవిస్తారు. అయితే, ఓ కానిబీడీలకి ఓఅగ్గిపెట్టెనా అధమంకావాలి గనుకనున్నూ, ఎక్కడేనా ఆ జంతువు తాలూకు ఒక నెరుసు పడిందంటే ఆ చుట్టుప్రక్క

ప్రాంతం అంతా దగ్ధపటలం అవుతుందనే భయంచేతనున్నో దాని ప్రచారం కొన్ని కొన్ని చోట్ల ఉంటుంది.

ఇక చుట్టాసిగరెట్లని రెండింటినీ మాత్రమే పోల్చాలంటే, చుట్ట మోటు, సిగరెట్టు సీటు, చుట్ట నల్లజాతి, సిగరెట్టు తెల్లజాతి చుట్టఅంతా పొగాకేగనక, అది పత్రగ్రంథము, కాబట్టి ఆధునికం, ఇంగ్లీషుచదువుకీ సిగరెట్టుకీ సంబంధం ఉందని ఋజువు చూపించడానికే సిగరెట్టు కాకితంతో చేశారని కొందరినమ్మకం. చుట్టవాసన చుట్టకంపు, సిగరెట్టు వాసన సిగరెట్టుపరిమళం. ఆ పరిమళం గ్రహించలేనివాడు తనకీ మళ్ళీ మహా ఇంగ్లీషువచ్చునని ఏ మొహం పెట్టుగుని చెప్పుకోడం అని కొందరి ఊహ. ఏమంటే! ఆ సిగరెట్టు వాసన కేవలం ఆఇంగ్లీషువాసనేనండీ!

ఈ రెండు స్వరూపాలూ కూడా వాయురూపేణా మాయమై, జగత్తంతా చివరకి మాయగదా అని చెప్పక చెబుతూంటాయి. ఇవి వెలిగి వెలిగి బూడిదకూడా అవుతాయి. ఆవిషయంలో చుట్టబూడిదే పేరుమోసింది. దాన్ని కొందరు చచ్చుపిలుపులూ పిలవక "చుట్ట విభూతి" అంటారు. కొందరు రహస్యంగా చుట్టకాల్చేవాళ్ళు అల్లాంటి విభూతి జాగ్రత్తగా ఖాళీ అగ్గిపెట్టెల్లో కిందరాలకుండా విదిపి అది కురుపులకి మందుగా వాడుతున్నారట. మతాబా బూడిద వాడినట్టు! సిగరెట్టు విభూతికి అంత తెల్లదనంలేదు, పేరూ లేదు, అందుకనేఅదిజాగ్రత్తచెయ్యరు, కొందరుతక్కిన

వేళ్ళతో సిగరెట్టు పట్టుగుని చూపుడు వేలు ఒక్కటే మాత్రం అభినయించి, ఆ విభూతి ఊడకొడతారు. మరి కొందరు దాన్ని తర్జనీ మధ్యమాలతో నొక్కి ఉంచి, ఒక్క చిటికెలో ఆ విభూతి విసర్జిస్తారు. క్రియకి, గాలి గాలిలో కలిసిపోతుందన్రా అని ఈ రెండూకూడా సెలవిచ్చినా, వీటిల్లోనూ మళ్ళీ శాస్త్రంత తేడా ఉంది. సిగరెట్టుమట్టుకి అంతా ఆఖరికిశూన్యమే అంటుంది. చుట్ట అల్లా అనదు. చుట్టకాల్చేవాళ్ళు ఉమ్ములు వేస్తూంటారు. (ఉమ్ములవిషయంలో వీళ్ళని ముంచేవాళ్ళు మరోళ్ళున్నారు, మసాలా కిళ్లీలవాళ్లు! ఆ ఉమ్ముల అభిప్రాయం ఏమంటే, చివరికి జగత్తంతా గాలిలో కలిసిపోదు, ఉంటే జలప్రళయం ఉండచ్చునిన్నీ! అని. అంటే ఉండడం ఎంచేతంటే, కొందరు కొందరు చుట్టేశ్వరులు ఆ ఉమ్మి మింగేస్తారు. చుట్టలో పొగాకు చుట్టుగుని ఉండడంవల్ల దాన్లోనే ఎక్కువ తిరగడం ఉంది. సిగరెట్టులో వక్రత లేదుగాని, చీలిపోడం ఉంది. చుట్టలో ఉండే చేదు, రింగు, గీర వగైరాలు సిగరెట్టులో మృగ్యం. ఆరిందా జనంమధ్య ఉన్నప్పుడు సిగరెట్టే పీల్చాలి అనిన్నీ, తప్పనిసరియై ఇతర స్వరూపాలుదొరకనిస్థలంలో మాత్రం బీడీఊకుకోవచ్చునిన్నీ. కేవలం బాహ్యానికి వెళ్ళి కాల్చడానికే చుట్టపుట్టిందనిన్నీ సిగరెట్ పక్షపాతులైన స్నేహితులు వాదిస్తారు. కాని, ఒంటరిగా ఉన్నవాడికి చుట్టే చుట్టం. ఎంచేతంటే, ఒక్కొక్కడు, కుర్చీలో కూర్చుని, చుట్టకాలుస్తూ పొగకేసి చూస్తూ, గంటలకి గంటలు గడుపు

ఫుతూ, పర్యవసానం శూన్యం అయినా దీక్షగా ఏదో ఆలోచి స్తూన్నట్టు గంభీరంగా ఉండగలడు. సిగరెట్టువాడు అలా ఉండ జాలడు, చుట్టవాడు, తనుఏదో మూల కూర్చునిఉన్నా, ప్రపం చం జరగడం విషయంలో తనఖంజాయింపు కూడా కొన్ని పాళ్ళు ఉన్నట్టుకనిపిస్తాడు. కాని, కిల్లీనమిలే టైములోనే చుట్టకాల్చ డానికివీల్లేకపోవడం చుట్టయొక్క దౌర్భాగ్యం. ఆ వాటంసిగ రెట్టుది. అందుకనే; భోజనమై, తాంబూలం వేసుగుని, అద్దం ఎదట "నెక్ టై" ముడేసుగుంటూ, పెదవి చివర సిగరెట్టు ఊగిసలాడుతుండగా, అప్పుడే మాటలు చెబుతూ, నాగరికత కాపాడుతూన్న ఉద్యోగులు తొమ్మిదిన్నరకి ఇళ్ళల్లో దొరుకుతారు. చుట్టకాల్చడానికి దాన్ని పళ్ళతో డబాయించి పట్టుగోవాలి. అందుకని, అవతలచివర అగ్ని ఇవతల చివర (లాలా) జలం. సిగరెట్టుని పళ్ళతో నొక్కినవాడు వొట్టి అఘాంద్రాపీనుగు. వాడు, అది ఎంతకోమలం అయినదో గ్రహించనివాడు; వాడిపళ్లు ఊడకొట్టినా పాపం లేదన్నాడు ఒక సిగరెట్టిసు! అంచేత, దాన్ని పెదవులతో పట్టాలి. ఆమాటకొస్తే కొందరు ప్రజ్ఞావంతులు పెదవి చివరతో కూడా సిగరెట్టుని నిలబెడతారు, మీసం మీద నిమ్మకాయ నిలబెట్టినట్టు. అందు మూలాన్ని, సిగరెట్టు ఇవతలకొస తడిగా ఉండదు. ఆ కారణం వల్ల, సిగరెట్టులోని అద్వితీయవిశేషం ఏమిటంటే, అది మధ్య రంగంలోతీసి, ద్వితీయుడికిచ్చి, వాడిప్రాణం రక్షించవచ్చు ఆట్టే ఎంగిలి కలియకుండా! ఈ అఘాంతరం తప్పిపోయే టందుకు

గానూ, కొందరు మిత్రులు ముందే సిగరెట్టుని సమద్విఖండనచేసి చెరోసగం మొదట్లో నేపుచ్చుకుంటున్నారు. ఇది అరుదు. చుట్ట జంతువుకి ఇల్లాంటి ప్రజ్ఞ లేదు. కాని అందులో విశేషం మరోటి ఉంది. కాల్చేఅసామిదే దాన్ని తల్లకిందులుచేసి పెదవులతో పట్టుగోవచ్చు. ఇది కొన్ని కొన్ని గ్రామాల సోదర సోదరీమణులలో అభ్యాసం. చుట్టపొగ ముక్కులోంచి తెప్పించడం అంతసులువు కాదు; అందులో పాటిఅనుమరీ శ్రమ. ముక్కులోంచి పొగలొస్తాయనే కొందరు సిగరెట్టు కాల్చడం. చుట్ట కాలుస్తూ మాట్లాడితే, తథదధాలు వగైరాలు పలుకవు. వినేవాడికి చిరాకు. సిగరెట్టు కాలుస్తూన్నప్పుడు, ఓష్ఠ్యంతప్ప కడమా అక్షరాలన్నీ, మూతి ఏవంకరగానో పెట్టిపలకవచ్చు, పళ్ళకిపని లేదుగనక! చుట్టలో మరో చిక్కుంది. ఎవరో అస్తమానం ఇతర పనిమానుకుని పీలుస్తూంటేగాని ఆగి పోతుంది. వెధవ ఆరిపోడం ఇదీను! అందులో చుట్టఆరిపోడం ఉండే, అది గొప్ప ప్రాలబ్ధాల్లో ఒకటి. అందుకనే కొందరు చుట్టకాలుస్తూండగానే ఏమరుపాటుగా నిద్రపోయినా, ఏమీ ప్రమాదంలేదు. అది పట్టుతప్పి పడిపోయే వేళకి ఆరే ఉంటుంది. కాని, సిగరెట్టు ఎక్కువ బాధ్యతవహించిన ప్రాణి. సిగరెట్టుని అంటించి ఒదిలిపెట్టేసినా, దానిపని అది క్రమేపీ చేసుకుంటూ పోతుంది, వెనకాల కొందరు లాగేవాళ్ళు ఉన్నాసరే, మానినాసరే. అనగా దానికి చూపిస్తే అందుకు పొగల తెలివి ఉంది. సిగరెట్టుకి పునర్జన్మలేదు. చుట్ట చాలా

పాపం చేసుగున్న ఘటం గావును, దానికి పునర్జన్మలు ఉన్నాయి. అనగా, ఎవడేనా సోదరుడు కాల్చే కాల్చే చుట్ట ఆరిపి, తలపాగాలోనో, గోడమూలో పెట్టి కాస్సేపటికి మళ్ళీ ముట్టిస్తూంటాడు. అది వాడికి బాగుండో, తప్పనిసరో గాని కడంవాళ్ళు చస్తారు. మంచిచుట్ట వాసనేస్తేనే డోక్కునే వాళ్ళు, చుట్ట యొక్క జన్మాంతర వాసనతోటి ఘూర్ణిల్లుతారు. చుట్టలో మరో పేచీ ఉంది ఒకొక్కప్పుడు దానికి చిన్న "బుసి" ఉండి, పీల్చేవాడికి అంకిళ్ళు పడిపోయినా సరే, పొగమాత్రం రాదు, చచ్చినా! దాంతోటి, ఆపీల్చే వాడికి ఊహుకోపం జాస్తీ అయి చుట్టు పక్క వాళ్ళని చంపాలని ఉంటుంది. అల్లాకొంత ప్రయత్నించి, ఆసకి, ఏకాగ్రితమో చుట్టబెట్టుగుని ఎల్లానో ఇదవుతాడు. సిగరెట్టులో ఈ క్షోభ లేదు. చుట్టవల్ల పళ్ళన్నీ జీవితంలోనే పొగ చూరడం కాక, పెదవి మీద వాతలుకూడాను. అదీగాక, చుట్టకాల్చడం అనేది ఒక పనిలా కనిపిస్తుంది, సిగరెట్టు కాల్చడం పని గాని పని—అందుకనే సిగరెట్టు చదువుకున్నవాడికోడి! చుట్ట వెనకెంతో, ఇప్పుడూ, ఎప్పుడూ అంతే! సిగరెట్టు స్వల్పకాలంలోనే మారుతుంది; కొత్తమార్కుది దగుతుంది. ఇంత తెలివితేటలతో ఉన్న సిగరెట్టు కాల్చడంవల్ల ఉండే లాభాలు తియ్యడానికీ, ఉన్నయేమో చూడడానికీ ఓకమిటీ వారు పనిచేస్తున్నారు, సులోచనాలు పెట్టుగుని. ఇది కాల్చడంవల్ల ఉండే ఖర్చు లెక్క వెయ్యడానికి మరోకమిటీ ఉన్నారు వీరి రిపోర్టులు తేలేయోగ్యత కనిపించదు.

హెచ్చుతగ్గులు ఎల్లా ఉన్నాసరే, నేను చుట్టమానను. మాన్తే, భూ-వాయు సమస్య పరిష్కారం కాదు ఈ ముక్కలే నాకు శరణు...అన్నాడు ఒకడు.

"ఎముక మిగిల్చి మాంసమునెల్ల భక్షించు
క్షయరుగ్మతలకు వజ్రాయుధంబు
లోహమాండూరాల లొంగక సాధ్యమౌ
కఫవాతములసిత ఔర్మ్యకంబు
శూలాల పొడిచిన లీల శూల జనించు
అల యజీర్ణముల సిద్ధౌషధంబు
ముబ్బుపట్టిన యంత బొబ్బలు పెట్టించు
నుబ్బసాదులకు సూర్యోదయంబు
జనుల నగ్నిముఖుల నొనరించు సి చుట్ట
కంపులెల్ల సొగనంపుచుట్ట
దోమ బాధ తొలగ ద్రోయును పొగ చుట్ట
చుట్ట మహిమలెన్న శూలి కగునె"

మంచి చెడ్డలు ఎల్లాఉన్నాసరే నేను బీడీమానను. మాన్తే, హిందూ—మహమ్మదీయ సమస్య పరిష్కారం కాదు. ఈముక్కలే నాకు శరణు—అన్నాడు-ఇంకోడు.

దాడీ ముందుగ వచ్చెను.

బీడీ తరువాత వచ్చె విధవిధములుగా
బీడీ పొగలకు పాడ్లా
ఏడీ కాదనెడి పురుషుడెల్లా హైసం.

మళువు బలువులు ఎల్లా ఉన్నాసరే నేను సిగరెట్టు మానను. మానేస్తే, ప్రాచ్య- పాశ్చాత్య సమస్య పరిష్కారం కాదు. ఈముక్కతే నాకు శరణు—అన్నాడు మరోడు.

నాగరికత లేని ప్రజ
సిగరెట్ చవి చూడకుండ సిగరెట్ పొగరెట్
సిగసిగరెట్ పొగపొగరెట్
సిగరెట్ పొగరెట్టటంట చెల్లదు "స్వార్లీ"

ఇలాగ్గా, ధూమ విషయంలో హిందువులు యథాశక్తి పనిచేస్తున్నారు. కాని అంతా నడుంకడితేగాని కార్యం నెరవేరదు. అంతా చేతులు కలిపి పనిచెయ్యాలి. ధూమం, కీర్తికిమల్లేనే తెలుపుకాబట్టి, ఏనాడు హిందూదేశమంతా ఏకమై పొగపీల్చి వదలుతుందో, నాడే ఈ దేశపు శుభకీర్తిదశదిశలా వ్యాపిస్తుంది. స్త్రీలుకొందరు ఇంగ్లీషు నేర్చి, పురుషులతో సమానం అవడానికి చేస్తూన్న యత్నాలలో సిగరెట్ సేవిస్తూఉండడంశుభసూచన. ఈ ధూమ స్వరూపాలని కనిపించినప్పుడల్లా అంటిస్తే, లోకకళ్యాణం అట్టేదూరం ఉండదు.

## రౌండు టేబుల్

ఓ చోట జరగబోయే రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో వెయ్యవలసిన టేబిల్‌గురించి మాటామాటా వచ్చింది. రౌండుటేబిల్ అనేది ఏదో ఊరికే గుండ్రంగా ఉండడమే కాక సంపూర్ణంగా ఉండాలని కొందరన్నారు. మరికొందరు

అట్లా పీల్లు లేదనిన్నీ, భూమిగాని మరి ఇతర గ్రహములు కాని, అవి నడిచేదారులు గాని, ఏవీసంపూర్ణధోరణిలో లేవనిన్నీ, అందుచేత అయినదానికీ కానిదానికీ సంపూర్ణం అంటూ కూర్చోక వట్టి పూర్ణం ముందు పుచ్చేసుకుని ఆపైని "సుం" దెబ్బలాట ఆడితే, కడుపు నిండుతుందనిన్నీ, కాబట్టి ప్రస్తుతం టేబిల్ యొక్క ఆకారం కోడిగ్రుడ్డులా ఉంటుందనిన్నీ, వాదించారు. టేబిల్ యొక్క ఆకారం ఎల్లా ఉన్నా అది కొంతేనా ఇటూ అటూ జరగాలంటే, టేబిల్ యొక్క ప్రతీకోడుకీ కింద చక్రప్రయోగం చెయ్యక తప్పదని మరికొందరు తెలివిగలవారు అన్నారు.

శారదాబిల్లు

శారదాబిల్లు శాసనం అయినా దాన్ని జనం శారదాబిల్లు అనే వాడుతూంటారు. ఈ పరిపాలనలో జనం ఆబాలగోపాలంగా ఉచ్చరించిన పేర్లల్లో ఇదొకటి. కాని ఈ మాట యొక్క వాడకం, అర్థం, వ్యాఖ్యానం పాత్రల్ని బట్టి ఉంటోంది. కొందరు దాన్ని 'శార్ధపు' బిల్లుఅన్నారు-అనగా దీనితో శార్ధాలు ఆఖరు అనో, లేక దీనితో శ్రోత్రియత్వానికి శార్ధం అనో కొందరు ఇది 'సరదా' బిల్లు అన్నారు—అనగా దీనితో జనానికి ఎక్కడలేని షోకులూ బయల్దేరతాయని గోవును. శారద అంటే సరస్వతి గనక ఈబిల్లువల్ల ఆడవాళ్ళు మాటలు నేర్చి మరి ఎవ్వరి మాటా లెక్క చెయ్యరు

అని కొందరు. శారద అంటే 'నూతనం' అని అర్థం. కనక ఈ క్రొత్తబిల్లుని శారదాబిల్లు అన్నారని కొందరు. శారద అంటే అసమర్థుడు అని ఉంది. గనక అల్లాంటి వాళ్ళ బిల్లుని శారదా బిల్లు అన్నారని కొందరు. శారదా అంటే శరదృతువులో జనించింది అని అర్థం. ఇది కూడా శరదృతువుయొక్క సామీప్యంలో పుష్పించింది కాబట్టి ఇది శారదాబిల్లు అన్నారని కొందరి మతం. శారద అంటే ఏడేసిపత్రాలు ఒకొక్క పర్వం దగ్గరఉన్న అరటిచెట్టుఅనికూడా ఉందికదా, ఇందులోకూడా ఏడుస్తూ ఏడుసార్లు ప్రతీపర్వానికీ పత్రాలు అనే ఏడాకులు పుచ్చుకోడం ఉంటుందిగదా అని దీన్ని శారదాబిల్లు అని ఉంటారు అని కొందరి వాదన, శా అంటే దేవతాపూజ, ర అంటే శూన్యం (అయి) దా అంటే చూపులు (ఎక్కువవుతాయి) గనక ఇది శారదాబిల్లు అని ఒకరు. శా అంటే సామర్థ్యం ర అంటే నశించి ద అంటే భేదాలు (ఎక్కువవుతాయి) గనక ఇది శారద్దాబిల్లు అని ఒకరు. శా అంటే శ్రేష్ఠుడు (కూడా) ర అంటే శిరస్సు (వంచి) దాఅంటే భార్యని (వేడుకోవాలి) గనక దీన్ని శారదాబిల్లు అన్నారని ఒకరు. శాఅంటే తేజస్సు (తో) ర అంటే వజ్రం (లాంటి దేహాలతో) ద అంటే ఓర్పుతో (జనం పుడతారు ఇప్పటి కునిష్ఠిరకం కాకుండా) అంచేత ఇది శారదాబిల్లు అని ఒకరు. శా అంటే లక్ష్మి (ఉండాలి). ర అంటే మన్మథపరిపాలన (ఉండాలి), దా అంటే వైరాగ్యం (లాభంలేదు అనేటట్టు వస్తుంది) గనక

దీన్ని శారదాబిల్లు అన్నారని ఒకరు. ఒక ముసిలావిడ ఈమధ్య మాట్లాడుతూ "అయితేనూ, ౧౪ ఏళ్ళలోపల పిల్లలు పెద్దమనుషులు కాకూడదంటూ పైవాళ్లు గూలు పెట్టారట నిజమేట్రా, అబ్బాయి!" అనికొడుకుని అడిగింది. రేపు ఏప్రిల్ ఒకటో తారీఖు లగాయితు ౧౪ ఏళ్ళలోగా ఇండియాలో పెళ్ళిళ్లు చెయ్యకూడదని దీని అర్థం అని ఒకావిడ వాదించింది. "అయితే, ఈబిల్లు రెండుమూడేళ్ళదాకా అచరణలోకి రాదంటారు. నిజమే?" అని కొందరు అడుగుతూంటారు—అల్లాయితే బాగుండునని వాళ్ళ లోపల అభిప్రాయం. ఒకవేళ అల్లా జరిగితే, ప్రస్తుతం పెళ్ళి చేసిన వాళ్ళలో కొందరు పశ్చాత్తాపపడతారు.

ప్రిన్సిపాలు కావలసినవారికి ఉండవలసిన లక్షణాలు

(ఒక కమిటీవారి అభిప్రాయం).

౧. ప్రిన్సిపాలు పొడుగేనా ఉండాలి, జబరిద స్త్రీగా నేనా ఉండాలి, వీల్లేకో స్తే రెండిందాలా ఉండాలి.

౨. ప్రిన్సిపాలు ఇంగ్లీషే చెప్పాలిగాని, తెలుగూ, హిందూస్తానీ, శాస్త్రంకాదు.

3. ప్రిన్సిపాలు కడంపికాకపోతే పీడాపోయిరి అధమం సిగరెట్టయినా నాగరకతతో పీల్చడానికి తగిన గుండెధైర్యం కలిగి ఉండాలి.

౪. ప్రిన్సిపాలు అధమం సాలుకి రెండుసందర్భాలలో నేనా పైవారితో ఓడిపోయే స్వభావం కలిగి ఉండాలి.

౫. ప్రిన్సిపాలు మంచి తెలివి, అపూర్వప్రజ్ఞ కలిగి ఉండాలి. పాఠం చెప్పనక్కర్లేదు. దాన్నిబట్టే ఇతరులు ఆయన తెలివి స్థిరపరచడం.

౬. ప్రిన్సిపాలు [illegible] అని వాటిని అక్షరాలా యమములలా ఆచరణలో పెట్టరాదు.

౭. ప్రిన్సిపాలు స్వజనాన్ని ప్రేమించాలి.

౮. ప్రిన్సిపాలు కొంత దాన ధర్మ బుద్ధి కలిగి ఉండాలి.

౯. ప్రిన్సిపాలు ఒకవేళ అఖండమైన తెలివిగలిగి ఉన్నా, కుర్రాళ్ళని పరీక్షకి పెట్టించకుండా ఆపకూడదు.

౧౦. ప్రిన్సిపాలు తెలివి ఉండీ, పనిచేసేవాడైనా ఎవరో ఒక మహామహుడి మాటేనా వినాలి కాని, ఏదేనా చెప్పి వెళ్ళినప్పుడు తరుముకొని రాకూడదు. తుక్కుని ఇసక్కా కలపనూకూడదు.

౧౧. ప్రిన్సిపాలు తనకి రాకపోతే రానట్టు ఊరుకోవాలిగాని, ఏరోజుకు ఆరోజు పాఠం ఎవరి దగ్గరో చెప్పించుకుని క్లాసులోకి తయారు కాకూడదు.

౧౨. ప్రిన్సిపాలు తన సబ్జెక్టు అయేది కాకపోయేది, ఒకటేమిటి నాకన్నీ సమానమేఅని ప్రతీదానికీ కూడా ఎక్కడ బడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు లెక్చరు ఇవ్వడానికి (ఇంగ్లీషున) తగినవాడు కావాలి! లేకపోతే, ఆయన తాలూకా బోర్డు ఎలిమెంటరీస్కూలు మేష్టరుకంటె తక్కువ అనుకుంటారు.

వార్తలు.

౧. ఆంధ్రవిద్యార్థుల సమావేశం యొక్క కార్య క్రమం యావత్తున్నూ ఇంగ్లీషు భాషలోనే జరిగి ఉండడం వల్ల, వారు తమభాష మానుకోడంలో ప్రకటించిన స్వార్థ త్యాగానికి సానుభూతి కనపరుస్తూ అక్కడ హాజరుకాని, ఆంధ్రేతరులు ఒకతీర్మానమున్నూ, అరిటిపండొలిచినట్టు భావబోధ అయి ఉండడంవల్ల ఆమోదం వెలిబుచ్చుతూ హాజరైన ఆంధ్రస్త్రీ బాలవృద్ధులు ఒకతీర్మానమున్నూ యేదిక్కూలేని తమ ఇంగ్లీషుని శ్రమపడి ఆంధ్రవిద్యార్థులు నిలబెట్టినందుకు తమ అమితకృతజ్ఞత సుమ్మరిస్తూ లండన్ కవులు ఒక తీర్మానరాజమున్నూ గావించి పంపినారని లోగడ ప్రచురింపబడిన సంగతి కల్లవార్త అని మావిలేఖరి పంపిన సవరణ నేడే మాకు చేరింది.

౨. జంతువులకూతలు, పిట్టలకూతలు, లోకంలో తక్కిన శబ్దాలున్నూ తానొక్కడే పుట్టించి సభని రంజింప చెయ్యడల్చుకొన్న ఒకధ్వని కాడు టికెట్టు పెట్టగా, హాస్యానికి వేంచేసిన నూరుగురూపాయల జనులూ, అతడు రంగంమీదికి వచ్చేదాకా ఉండబట్టలేక, ఆ కూయి జంతుపక్షుల ధ్వనిభే దాలు సునాయాసంగా చెయ్య మొదలు పెట్టగానే, హాస్య గాడు టికెట్టుసొమ్ము వాపసుచేసి, అట్టి అద్భుతచిత్రం సభ వారు అభ్యాసం లేకుండానే ఆర్జించి నందుకు వారిలో ఒకరి

కైనా మెడలు ఇవ్వకమానననని ఇచ్చేశాడు. ఆ మెడలు ఒక విద్యార్థి పడసినందుకు ఆంధ్రులు ఎల్లానో తీరుబడి చేసుగుని కొంచెం గర్వపడాలి.

3. ఒక గ్రామఫోను కంపెనీవాళ్ళు గొప్పగాయకుల దగ్గిర్నించి ఉచితంగా రికార్డులు పుచ్చుగోడానికి రాగపిల్లిలో దిగగానే, ఆంధ్రగానవిద్యాదక్షులగు ప్రముఖులు చాలమంది, తమకు ఆహ్వానం రాకపోయినా, కంపెనీవారికి తమర్ని ఆహ్వానం చేసే సంకల్పం మనస్సులో ఉన్నట్టు దివ్యదృష్టిని కనిపెట్టి, వెళ్ళగా, కంపెనీవారు స్వాగతపత్రం ఇవ్వనందున వీరు కోపంతో వెనక్కి నిష్క్రమించి సినీమాలో చేరాలని యత్నించుతున్నారని తెలిసింది.

4. రైల్వే ప్రయాణీకుల సంఘాలు కలిసి ఎన్నుకున్న ఒకాయన ప్రయాణీకుల కష్టాలుగురించి రిపోర్టు తయారు చెయ్యడానికి రైల్లో తిరిగితిరిగి కనిపెట్టిన సంగతి ఏమిటంటే!- రైల్వేకంపెనీవారికిన్ని ప్రయాణీకులలకున్నూ ఎంతో అన్యోన్యంగా ఉన్నందుకు మిక్కిలి సంతోషం అవుతోంది. జనులు కంపెనీవారి మాట జవదాటడం లేదు. కంపెనీవారు రైలు పెట్టెల్లో "ఎంగిలి మూయవద్దు" అని రాసినప్రకారంగానే జనం అంతా పెట్టెలోపలే, జాగ్రత్తగా, అవతలికి చెదరకుండా, ఉమ్మి వేస్తున్నారు. మరీన్ని కంపెనీవారు "దొంగలున్నారు. జాగ్రత్త" అని ఎల్లానూ రాసేశారుగదా, ఊరుకుంటే వారు సమావేశమై చిన్నపుచ్చుగుంటారేమో అని

ఎంతో అయిష్టంతో చాలామంది దొంగతనాలు యథాశక్తిగా చేస్తూనే ఉన్నారు. ఇది శాంతిసూచన—అని.

౫. నెలక్రితం మామిడిపురంలో అయి ఉన్న పెళ్ళి సందర్భంలో, కన్యాప్రదాత, పెళ్ళికొడుకుకాళ్ళు కడుగుతూన్న సమయంలో, కన్యాప్రదాతకి ముచ్చెమటలూపోసేటట్టు ఓ తేలు అంటపొడిచింది. ఎంతవెతికినా తేలు దొరకలేదు. చివరకి పెళ్ళికూతురు అన్నగారు తన బ్యాటరీలైటు తెచ్చి "ఫోకస్" చేసిన మీదట, ఆ తేలు ఇంకా తణుకూ బెణుకూ లేకుండా పెళ్ళికుమారుడియొక్క మడవ నెరదల్లో మకాంచేసి ఉన్నట్టు తెలియవచ్చింది.

౬. లక్షిపిల్లినగరంలో చాలామంది జేరి, భార్యాభర్తల విడాకులచట్టం ఉంటేనే చాలా బాగుంటుందని, ఏకగ్రీవంగా తీర్మానించారు. ఈ అభిప్రాయానికి ప్రతికూలంగా ఉన్నవాళ్ళని వాళ్లు లోపలికి రానియ్యలేదు. దూసుకుపోయి వచ్చినవాళ్ళని నోరెత్తనియ్యలేదు. ఈ తీర్మానం ప్యాసుచేసిన వారిలో చాలమంది భార్యలూ కారు, ఆఖరికి భర్తలేనా కారు.

౭. ఎలెక్ట్రిక్ దీపాలు పెద్దగాలికి ఆరిపోయే స్వభావంకలిగి ఉండడంచేతనున్నూ,—(అంటే ఆ గాలికి తీగెలు తెగుతాయి, తెగితే దీపాలు నిద్దరోతాయి), అవి ఉంటే దెయ్యాంలా ఉండడం, పోతే ఏమ్యం అయిపోవడమేగాని సన్నంగా ముత్తెం అల్లాచేసి అట్టే పెట్టుగోడానికి వీలులేనివి అవడంచేతనున్నూ, చటుక్కున ఏసిగరెట్టేనా అంటించు

గోడానికి గాని, ఏనెయ్యేనా వెచ్చబెట్టుగోడానికిగాని, ఈషన్మాత్రమూ ఉపచరించేవి కాకపోడంచేతనున్నూ, రాత్రెళ్ళు కూడా నిస్తేజంగా ఉండి ఏగ్యాసులైటేనా పట్టిగెడితేగాని కంటికి ఆనకుండా చీకటిచేత ఆవరింపబడి ఉండే రకంవి అవడం చేతనున్నూ ఇంకా నిదానంగా కొంతకాలం పరిశీలన చేసిన మీదటగాని మేము అట్టే తొందరపడము అని చంద్రాపుర జనులు చేసుకున్న తీర్మానం, వారి జ్ఞానతేజానికి నమోనా.

౮. ఆంధ్రపేపర్ మిల్సంటే చప్పరించిన వాళ్ళల్లో కొందరు ఇప్పుడు మిల్సుపోగవొదిలి, కూతిట్టి, తిరిగేసరకి బయల్దేరిన కాగితంచూచి తమరూ తెల్లపోయి "ఇంతా చేసి కాగితమేనా, పోదూ!" అని మళ్ళీ చప్పరించారు.

౯. కలవలపట్నం అనేనగరంలో పౌరులంతాపట్టి తమ ఊరిస్కూలు హెడ్డుమాస్టరుగారి పని సరిగా లేకపోవడంచేత ఆయన్ని శిక్షించదల్చుకుని, ఆయన్ని పూర్తిగా తీసెయ్యడానికి చేతులురాక, ఆయన "హెడ్" మాత్రం తీసేసి మేష్టరీమాత్రం అట్టేపెట్టారు. ఆయన హెడ్ ఒక దీర్ఘమైనవ్యాధి అపన్నీ, అట్టివ్యాధి ఏకోశాన్నా లేని మనియొకర్ని వారు ఆస్థానే వేశారనిన్నీ వినబడింది.

౧౦. నగరవాసులూ. అక్షరాస్యులూ అయిన ఆంధ్రజనం యావద్విశిష్టం ఎరుగున్న పేర్లనుగురించి కాఫీహోటల్లో ఒకరావుగారు మాట్లాడుతూ, "గయోపాఖ్యానం,

వీరేశలింగం, భక్తచింతామణి, కాశీమజిలీలు, అపనాత నామనా!" లాంటివి సెలవిచ్చాడు. ఈ లిస్టులో 'నమస్తే' గాని, 'శ్రీరిభజింతున్' గాని చేరే సూచన్లు ప్రతీనోటా గోచరిస్తూనే ఉన్నాయి.

౧౧. ఒక పట్టణంలోని కాఫీహోటళ్ళ యెదటవీధి భాగాలున్నూ, సోడాషాపులయెదటి వీధిభాగాలున్నూ, నాటక వస్త్రశాలల చుట్టుపట్ల వీధులున్నూ, కంకరలేని వీధి భాగాలున్నూ, కావలసినవారి యిళ్ళయెదట వీధిభాగాలున్నూ అహోరాత్రన్నూ తడిసే ఉండడంవల్ల వీధులు తడిపే యత్నంలో అంతమంది తమరికి తోడ్పడుతూన్నందుకు ఆ పట్టణ మునిసిపాలిటీవారు తమపౌరుల్ని అభినందించారు.

౧౨. గోదావరీతీరజనులు పుణ్యజనులనిన్నీ, ఋషులనిన్నీ ఎక్కడివాళ్ళో అనుకుంటారు. పుణ్యజనులు అనడంలో ఆశ్చర్యంలేదు, ఈ యుగంలో. కాని ఇక్కడ ఋషులుఉండడం మాత్రం నిజం. ఎంచేతంటే, మెయిన్ రోడ్డు మీద ఎక్కడ చూసినా ముక్కుమూసుగుంటారు, స్మరించుగుంటూ ఉంటారు.

[ మాటవరస (2)—1931
ఆర్ట్సుకాలేజీలో
24—1—1931 తారీఖున
పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో
శ్రీగంటి లక్ష్మన్నగారి
అధ్యక్షత క్రింద జరి
గిన సభలో అసం
పూర్తిగా చదివినది.]

## బలరామయ్యగారి ఇంగ్లీషుతమ్ముడు

వెనక, మాఅందరికి మల్లేనే మాతమ్ముడుకూడా పెద్ద బాల శిక్ష పట్టి, పలకా చదగా పుచ్చుగుని వీధిబళ్లోకి వెళ్ళేవాడు. కాని, మాకు మరీ దగ్గరవాళ్ళల్లో కొందరు ఇంగ్లీషులు వెలిగించడం ప్రారంభించారు. వాళ్ళమీద పోటీకొద్దీ, వాళ్ళు కాస్త పక్కబెదురుగా ఉంటూండడానికి మావాణ్ణీ ఇంగ్లీషులో పడేశాం. ఇంగ్లీషు అనడంతోటే డబ్బుఖర్చు. ఖర్చు లేకుండా రాజవిద్య ఊరికే ఎల్లాఅబ్బుతుంది చెప్పండి అక్కడికీ, మావాడికి, దులాబీఖర్చు లేదు. పైగా మావాడు అయినవాడికి ప్రతీక్లాసులోనూ రెడ్డికంవేసుగుని కదలకుండా, కూర్చుని, ఇల్లంతా ఓకడికి తీసుగురాలేదు, వాడిధర్మమా అని. నేచెబితే గర్వంలా కనిపిస్తుంది—మావాడు అతిచురుకు ఏకసంతగ్రాహి. తోటివాళ్ళు చాలామంది ఏక్లాసులో బడితే

ఆక్లాసులో మకాం వేస్తూండడం, మావాడు ఎక్కడా ముచ్చట కైనా ఫేలవకుండా, చడీచప్పుడూ లేకుండా ఇట్టే దాటుతూండడం. అంచేత మావాడికి అన్నీ మెప్పులే, అన్నీ బహుమతీలే వాడికి చదువుపిడుగు, పరీక్షపహిల్వాన్ అనే బిరుదులుకూడా ఉండేవి, కుర్రతనంనించీ. మరిపై క్లాసు చదివిత్తామా మాన్దామా అని ఒక్కొక్క పెద్దమెట్టుదగ్గిర మేం లోపాయికారీగా ఆలోచిస్తూ ఉండేవాళ్ళం. ఆలోచన ఎందుకంటే తరవాత తరవాత దేవుడు రక్షించి మావాడు చెయ్యగల ఉద్యోగంలో ఆర్జించగలసొమ్ములో ఖర్చులన్నీపోగా మిగలగల డబ్బువల్ల, చదువు పెట్టుబడి సొమ్ముకి వడ్డీడబ్బులేనా కిడతాయా కిట్టవా అనే సందేహంచొప్పున. మరి లోపాయికారీగా ఎందుకంటే, డబ్బు ఖర్చుకి మేం సందేహిస్తున్నాం అని వెల్లడి అయితే, మాపరపతి సన్నగిల్లుతుందేమో అనే భయంచొప్పున, ఇంతలో ఎవరో పెద్దమనిషి చక్కా వచ్చి, నాతో ఈమాటచెప్పి ఆమాటచెప్పి, "ఇంకాచూస్తా వేమిటయ్యా, బలరామయ్యా! మీరు జమీందార్లు. మీవాడు సీమపచ్చి మిరకాయ వంటివాడు, చూపిస్తే అందుకుపోతాడు. వాణ్ణి చదువుమానిపించేరుగనక! నీరకం నారకం అయితే నేను మానిపించమనే పట్టడుదును. ఓముక్క వచ్చేవాడికి చెప్పించకపోతే, త్వోష్ట్రానికిటయ్యా చెప్పించడం! చాల్చాలు, ఎవడేనావింటే నవ్విపోతాడు, తక్షణం పట్నం పంపించెయ్, శంఖంలో పోస్తేగాని తీర్థంకాదు. అని నన్ను కోప్పడుతూండడం, దాంతోటి నేనుపొంగిపోయి, పైకిమాత్రం చప్పరిస్తూ, ఏ తలో తాక

పెట్టి మా వాణ్ణి పై క్లాసుకి పంపిస్తూండడం. ఇల్లాగ్గా జరుగుతో
చ్చేది, మొట్టమొదట మా వాడు చదువులో సరసరా జువ్వలాగ
పైకి లేచి, ఇంగ్లీషులో బాఘాతడిసి, నాని, ఊరిఊరుకున్నాడు.
మాలో వీడికొక్కడికే ఇంగ్లీషు రావడంవల్ల, వీణ్ణి మేం "ఇం
గ్లీషుతమ్ముడు" అని వాడుతూంటాం.

మరి ప్రస్తుతం. మా వాడితో కలిసి చదువుతూ చిన్న
క్లాసులోనే ఫేలిపోయి మానేసిన వాళ్ళపని, ఇప్పుడు,
మూడు పువ్వులూ ఆరు కాయలూగా ఉంది. అబ్బే, మరో
చమత్కారం! వాళ్ళల్లోనూ ఎంత చిన్న క్లాసులో ఫేలై
ఎంత పెద్దాళ్ళే ఇంగ్లీషు మానేసినవాడై ఉంటే, అంతపని
కొచ్చేవాడూ, అంత సంపాదనపరుడూ అయిపోయాడు. మా
వాడో! చదువుకునేటప్పుడు వీడిపని ఎంత ప్రభగా ఉండేదో
ఇప్పుడు అంత నస్కరంతిగా ఉంది. వీడికి ఉద్యోగం ఇస్తాననే
జ్ఞాని ఎవడూ కనపడ్డు. ఎక్కడేనా ఉద్యోగం ఖాళీగా ఉందని
తెలిసి ప్రయత్నించడానికి వెడితే (అనుకుంటే తప్పు, ఇల్లా
వెళ్ళడానికి బోలెడైంది!) ప్రతీ అధికారీ మా వాడితో
"నువ్వేంపని చెయ్యగలవ్?" అంటాడటగాని, "నువ్వు
ఎంత పెద్దపరీక్షప్యాసయ్యావ్?" అని అడగనే అడగట్ట!!
ఏమైతేం, వీడికి ఒక్కదమ్మిడీ ఇంటో పడేద్దామనే ఊహా
లేదు, పడెయ్యగలప్రజ్ఞలేదు. తనూ, పెళ్ళాం (ఆవిడ దగ్గర
మేం అసలు మాట్లాడలేం!) ఇద్దరు కూతుళ్ళూ (వీళ్ళకి
ఎప్పుడూ ఒళ్ళు నసిగా ఉండదు)—వీళ్ళంతా ఉమ్మడి సం

సారలిలోనే. అంచేత మా వాడికి ఊహా మొహమాటం. అసలు వాడికి నోట్లో నాలిక లేదు. పైగా వాడిదంతా అతి సుకుమారం! పైమీద కందువాపులా బరువే ఓ గజం నడవ లేడు—కారో, విమానమో కట్టిస్తాడు. ప్రతీదీ దర్జాగా ఉం డాలంటాడు. సొమ్ము రావలసినచోట దాక్షిణ్యం అంటాడు, ఇవ్వవలసినచోట తూర్పు మొహంగా తిరిగి దణ్ణం పెట్టి ఇచ్చెయ్యమంటాడు. వీడు చదివింది ఏమిటో మాకు తెలియదు, ప్రపంచానికి అక్కర్లేదు, (వాడేం జేశాడు, మేమే చదివించాం లెండి!) దైవచింత ఉందేమో అంటే, దేవుడూ నై గురూ నై అంటాడు; పైగా మన దేవుళ్ళు మనకంటె బొత్తిగా అన్యాయం అంటాడు. సరి, మతంచూద్దామంటే వాడిమతం నా కమతం ఒక్కమోస్తరుగానే ఉన్నాయి. పోనిమనిషైనా రాయల్లా ఉన్నాడేమో అంటే, అబ్బే, ఆకోటు తొడిగినంత సేపే గాని, విప్పేస్తే మనిషికివంట్లో ఒంపు మాంసం లేదు, అడ్డిగెత్తు నెత్తురు లేదు. వొత్తి ఎముకలపోగు. ఎవడేనా తనకి అన్యాయంచేస్తే, వాణ్ణి
శాస్త రకాయించడం అంటూ లేదు-వాడిపాపాన్ని వాడే పోతాడంటాడు, లేకపోతే ఇంట్లోవాళ్ళమీదా నామీదా కోప్పడతాడు, లేకపోతే తనగదితలుపు రాయుల్లా పెద్దగడియ వేసుగుని ఒక్కడూ కూర్చుని అవతలవాణ్ణి తిడతాడు, ఎవళ్ళైనా బంధువులు తటస్థించినప్పుడు వాళ్ళతో-ఉన్నసంగతే ఆయిరి. లేకపోతే లేనిసంగతాయిరి—ఏదో వోటి యథా

శక్తి ఆప్యాయతా కనపరుస్తూ కలిమిడిగా మాట్లాడ్డం మా వాడు ఎరగడు. ఎక్కడేనా రక్తస్పర్శ ఉన్నవాళ్ళల్లో ఎదేనా కష్టం వచ్చినప్పుడు వాళ్ళని కాస్త పరామర్శ చెయ్యకపోతే బాగుండదని వీడికి తెలియదు. ఆవిధానం అసలు తెలియదు. తన సంసారాన్ని అత్తారింటి దగ్గిర్నుంచి తీసితెచ్చుకోడం తనకి సిగ్గుట, ఇంకోర్ని వెళ్ళి తీసుకురమ్మంటాడు; ఏమడుగుతావూ! శిస్తువసూలకోసం పొలాలమీదికి వెళ్ళి రారా అంటే, అక్కడ ఏమీ తోచదంటాడు. మొన్న మట్టుకి మొదట్లుగు గెంటగా వెళ్ళి, వసూలుసొమ్ము సాదరు ఖర్చుకి చాలక, నోటు రాసుగుని ఇంటికొచ్చాడు. పోనీ, అయ్యా, ఎప్పుడేనా తేలొస్తే ఎవడేనా పైజారుచ్చుగుని పచ్చడికింద కొట్టడూ? మా తమ్ముడే చేశాడూ! "తేలు ఎంత మంచి దనుకున్నారు! దోషం అంతా దాని కొండీది. కొండీ పట్టేస్తే, అది ఎంతో సాధువైపోతుంది. నేను పట్టుకుంటున్నా, చూడండి!" అని రెండు వేళ్ళతో పట్టాలని యత్నించాడు నేర్పుగా. కాని, దానిముండమొయ్యా, తేలు, అంతకంటె ఎక్కువ నేర్పుగా ఒక దెబ్బని రెండు వేళ్ళమీదా కుడా కుట్టింది. ఇక, పాము అంటే అసలే ఆశ లేదు. మా తమ్ముడికి రాత్రెళ్ళు చీకట్లో వెళ్ళడం భయం. ఏమిరా అంటే, "పురుగూ బుట్రా ఉంటాయేమో అని బెదురుగాని దొంగభయం చిన్నప్పణ్ణించీ లేదు." అంటాడు. దొంగలంటే జ్ఞాపకం వచ్చింది మొన్న ఈమధ్య ఒకముసిలాయన

ఇంట్లో దొంగ లడ్డారు. ఆయన జీవితం అంతా మాటలు చెబుతూనే ఉన్నవాడైనా, దొంగాణ్ణి పట్టడంలో—ఎల్లాగనుకున్నారు మళ్ళీ—భల్లూకప్పట్టు పట్టేశాడు. తరవాత వారానికి మా యింటికీ దొంగలొచ్చారు. అప్పుడు మా తమ్ముడు మెలుకువగానే ఉండి, మొహంమీదికి కూడా శాలువ లాగి కప్పుకుని పడుకున్నాడు గాని, వాళ్ళు ఒక్క వరసని ఇల్లంతా వీధిలో పెడుతూంటే కేక లేనా వెయ్యలేదు. ఏమిరా అని మొన్నాడు కనుక్కుంటే, కేక లేస్తే తనకి నామర్దాట పైగా తను అప్పుడు మెలుకువగా ఉన్నాడో, నిద్దరలో ఉన్నాడో అది ఓ పెద్ద స్వప్నసమస్యట, ఆ అవస్థగురించి ముందు ముందు పుస్తకం రాస్తానన్నాడు. పోనీ, తనుసొమ్ము తేకపోతే పీడాపోయిరి, నేను ఏవో మాసిగంబడి తెచ్చిన డబ్బెట్టి బజార్లోంచి ఏమన్నా వస్తువులు తేరా అంటే, టైం లేదంటాడు. ఒకొక్కప్పుడు ఇంట్లో పోరు పడలేక బజారికి వెడతాడా, ఆఖరికి కూరలు తేవడమైనా తెలియదు. తక్కెడకి దాళా ఉంటుందని మావాడు ఎరగడు. కొనుక్కునే వస్తువులు మంచివో కావో ఎరగడు. వంకాయకి ముచిగి దళ సరిగా ఉండాలనీ, ములక్కాడ మెలితిప్పితే తిరగాలని, వెలక్కాయలు డిడిక్కలు కొట్టి చూచుకోవాలనీ, బెండకాయ చివర విరుగుడుపడాలనీ, ఆనపకాయ గోరు దిగేటట్టు ఉండాలనీ, వగైరాలు మావాడికి బొత్తిగా తెలియవు. అట్టు—వెళ్ళడం. వెళ్ళి, దుకాణదార్ని 'ఈస

రకు మంచిదేటయ్యా!' అనడం. అంటే అతను "బేరగా రం అండి. ఫష్టు, మాన్యమైన సరుకండి" అంటాడు. లేక పోతే, అమ్మకోదల్చినవాడు తనసరుకు చవకచెత్త అంటాడా, చెప్పండి! దాంతోటి, మావాడు, "అయితే, ధర సిసలేనా!" అంటాడు. అంతేగాని, వీసెంత, శేరెంత, తూలం ఎంత అని అడగడు. ఎంచేతో తెలుసునా? ఎవస్తువు ఏ లెక్కని ఉంటుందో ఎరగడు. ఓసారి కస్తూరికని వెళ్ళి, 'వీసెంత!' అని అడిగాట్ట. అది మొదలుచేసుకుని, ఉమ్మడి ప్రశ్నలు నేర్చుగున్నాడు. దుకాణదారు, 'అయ్యా! మాదగ్గర రొండు మాటల్లేవు. వాకబు చెయ్యండి, తేడావస్తే రెట్టింపు. ముదరా యిస్తాను' అంటాడు. అంటే, మావాడు 'అయ్యా బేరం చెయ్యడం నాకు అసహ్యం. ధర విషయమా! సరే మీ యిష్టంవచ్చినట్టు పుచ్చుకోండి. డబ్బు అయినా మనకి ఆ లక్ష్యం లేదు. సరుకు మంచిది కావాలి. త్వరగా యిప్పించండి, నాకు టైంలేదు' అంటాడు. అంత ముళ్ళమీద నుంచుంటే బేరాలు ఎల్లా కుదురుతాయి! అపళంగా ఏవో తెచ్చి ఇంటో వేస్తాడు. అక్కణ్ణించి, స్నేహితుల్తో జేరి పేకాట, లేకపోతే, వాడిల్లాంటివాడు, వీడిల్లాంటివాడంటూ ఊళ్ళోవాళ్ళమీద యాగీ. ఇంతోటిశ్రమకీ మధ్యమధ్య ఫలహారం. ఓనాడు సీతాఫలాలు ఇంటికమ్మొస్తే, మావాడే బేరంజేశాడు. అమ్మే అమ్మి అర్ధణాకి అయిదు చెప్పింది. మావాడు, "నాకు అయిదక్కర్లేదు. నాలుగే చాలు. ఏరి తీసుగుంటాను మంచివి" అన్నాడు. అసలు మంచివి ఏరి తీసుగునే

పద్ధతిసే అయిదని దాని ఉద్దేశం. ఏం చెప్పనూ! ఇవన్నీ అల్లా ఉంచండి. పోనీ. ఇంతకొట్టుకునితినేరకం కాకూడదూ! సమస్తం ఇంట్లో ఉంటాయిగా! తన కేమున్నా లోటు రానిస్తామా? పొద్దస్తమానం తెగ చిరితిండి. చిరితిండి వాళ్ళకి అసలుతిండి మోటు, అయినాసరే, భోజనంవేళ అయ్యేసరికి, గంటలప్రకారం, విస్తట్లో అన్నం పడాలంటాడు. కడంవి ఎల్లానూ గంటలప్రకారం జరుపుగోలేం, భోజనమేనా జరపాలని మావాడిపట్టుదల. ప్రతీరోజూ ఇట్లో రూల్సుప్రకారం ఎల్లా దేవుళ్ళాడుతుంది, చెప్పండి! తిండి తిండని ఇంతబులబాటమే గాని, తీరావిస్తరదగ్గిరికి వచ్చేసరికి ఒక్కవాయేనా కలుపుగోకుండా, మెతుకులు, కోడిచిమ్మినట్టు చిమ్మి విస్తరంతా కళ్ళం అల్లాచేసి చక్కా పోతాడు. అంచేత, “నాయనా, సంపాదనా వద్దు, సమారాధనా వద్దు, నువ్వనుకుంటూన్న ఆత్మగౌరవం చెడగొట్టుగోకు, లోకవ్యవహారం నేర్చుగోకు, పోనీ ఇంత భోజనంచెయ్యడమేనా నేర్చుకోరా. వంటికి మంచిది. ‘శరీరమాద్యం’ రా.” అని అనేక కాలం నించి మాతమ్ముడికి నూరిపోస్తున్నాను. వాడికి జ్ఞానోదయం కాలేదు.

### భోజనోపదేశం

ఏమని నూరిపోశావూ అని అడగరేం? మనవిచేస్తున్నా! వెనక, మాప్రసిడెంటుగారు నాకు నూరిపోసిన ప్రకారమే.

వారు ప్రతీ పెళ్ళివిందుకీ వెళ్ళేవారు. మూఢమి అడ్డొచ్చి కొన్ని పెళ్ళిళ్ళూ, తద్వారా విందులూ, ఆగిపోవడం నించి వారాగ్రహించి మూఢమి అనగా మూఢులు పెట్టిన శూన్య భోజన నియమం అనేవారు. శారదచట్టంవల్ల పెళ్ళివిందులు అసలే మూలబడిపోయిన ఈ సంవత్సరం క్రితం వరకూ, వారు సాలుకి యాభై అరవై విందులకేనా వెళ్ళేవారు. వారు ఒక చోట కొంతకాలం సూపాధ్యక్షుడు ఉండి పిదప స్వయం కృషి చేత అఖిల ప్రపంచ భోజన మహామండలికి గౌరవాధ్యక్షులు అయ్యారు. విశేషించి, భోజనానికి పడగెత్తారు. వారి పతాకానికి చిహ్నాలు—పీట, ఆకు, రాగిచెంబు, మాషచక్రం, ఈ క్రింది మోస్తరుగా వారు సెలవిచ్చేవారు:—

“విందులకి తప్పకుండా వెడుతూండు, దాటపెట్టకు. భోజనం పెడతానన్నప్పుడు తినకపోతే, మళ్ళీ అప్పట్లో దొరకదు. అన్నింటికీ తయారీ అవసరం. విందుకి మరీ అవసరం టిక్కట్లుపందుకి తెగ అవసరం. విందుసంగతి రెండు మూడు రోజుల పూర్వం తెలిస్తే, చూచాయగా తెలిస్తే చాలు, హారం తగ్గించుకో, లేక భేది స్వీకరించు. మరీ శ్రోత్రియుల పక్కని కూచోవలిసొచ్చి, అథాత్తుగా మడిగట్టుకోడం అవసరం అయితే చొక్కా తీసేసి, బిళ్ళగోచీ పెట్టి, పైమీద పంచ సన్నంగా మడతెట్టి, ఎత్తెత్తి అడుగులేస్తూ, జనాన్ని తప్పుకోమను. అగ్రం వున్న ఆకు చూసుకుని, ఈనె తీసెయ్!

ప్రారంభించడానికి పూర్వం తెల్లబోయి మాట్లాడుతూ కూచుని టైం పాడుచేసుకోక, అంటులేని మిఠాయి వగైరాలు రుచిచూచి పేచీవస్తే, వడ్డించలేదను. జలపదార్థానికి కూడా స్థలాక్రమణ రోగం ఉంది గనక, భోజనంపూర్తి కాందే, ఉదకం తాగకు. తరవాత ఎక్కడేనా ఇంకోరింటికో కాబోయే విందు మార్పు మేరలో ఉంటే తప్ప, వుప్పు 'డబుల్ డోస్' చెయ్యి. కొండొకచో మాగాయిటెంక వడ్డించినట్టయితే, వెంటనే మజ్జిగ తెప్పించి అందులో అది ప్రప్రథమాన్నే నానెయ్. ఆవడలు వడ్డించేటప్పుడు దిక్కులు చూస్తూ కూచోక అపిడధిసమేతంగా పడ్డాయో లేదో, సరిగా పడ్డాయో లేదో గమనించు"

అంటే మాతమ్ముడు, "సరిగా పడ్డంవేమిటి! నాకు తెలియనట్టు చెబుతాంవే అన్నయ్యా!" అన్నాడు.

"సరిగా అంటే సరిసంఖ్యలో, అనగా, రెండు, నాలుగు, ఆరు ఇల్లాపడవలసినవే గాని అవి, బేసిగా దిగవూడదు. అవి కొంతవరకు ముచ్చటించి, వడ్డించేవాణ్ని దగ్గిరికి పిల్చి, చెవులో చెప్పు, "పూర్వాశ్రమం" తెప్పించండి అని.

"పూర్వాశ్రమంఅంటే ఏమిటన్నయ్యా!" అన్నాడు మా వాడు.

'ఎంతసత్తెకాలంరా నీది! పూర్వాశ్రమం అంటే కారప్పుగారె. ఇంకా పెరుగులో పడనప్పుడు అదేగా మరి దాని జన్మ! అవి అందిన వెంటనే మరోవా వడ్డించే వాణ్ణిపిల్చి (మొదట వాడే అయితే దిష్టితగలచ్చు) "నిజస్వరూపం" పట్రమ్మను,

అది కారంలేని అసలుగారె. శ్రీరాన్నం పల్చగా నేవిన్నమూ వడ్డించుకోకు. తెచ్చిన గోకర్ణంలోది చాలా భాగం అయిపోయిన తరువాత, మిగిలిపోయిన ముద్ద నీవిస్తట్లో బోర్లించమను; అప్పుడే నీకు జీడిపప్పు వగైరా గంభీర సామగ్రి దక్కుతుంది.

మా వాడు—ఒకవేళ పైవి ఆవేళ చెయ్యకపోతే,

నేను—ఎన్నో ఓటి చెయ్యక మానరు. లడ్డూలు చేస్తారనుకో. ఏంచేస్తావు?

మా వాడు—అమాంతంగా తినెయ్యడమే.

నేను—ఏడిసినట్టు ఉంది. అవి ముందు నేతివో నూనెవో పోల్చాలి. అందునిమిత్తం, అవి చిదిపి వాటిల్లో నెయ్యి వడ్డించుకో, ఆ మిఠాయి నేతిదా, నేతిమీద నెయ్యి మంచిది, నేగిలేదు. కాని అది నూనెదా, నెయ్యి కలిసింది గనక వాసన కొడుతుంది, విసర్జించు.

మా వాడు—నాకు అట్టే సయించదన్నయ్యా?

నేను—రీతి తెలియనప్పుడు పినోరి!

“ఏదైనా తీపిసరుకు ప్రత్యేకంగా తినడం పాపం. అది ఎప్పుడూ పకోడీలాంటి కారపుసరుకుతో చెరసహాయి స్వాహాలాగ లాగవలసిందే.”

మా వాడు—ఏమో! కారవే, ఎక్కువ తినాలని నా ఉద్దేశం!

నేను—నీఉద్దేశం ఎవడికాకవాలిరా, ఇందులో ప్రవేశమేనా లేనివాడివి! కృష్ణుడి ఉద్దేశంరా అదీ! “సుఖం

అనగా, తీపేనా! దుఃఖం అంటే కళ్ళమ్మట నీళ్ళుగసక. కార మేనా? అయితే విను. సుఖదుఃఖేఅనగా తీపిలా రాలు రొం డున్నూ అనగా లడ్డూ పకోడీలు రెండున్నూ సమే కృత్వా అనగా రెండు సమరాసులుగా ఇదే తో అదంత చోప్పున చేసి, లాభాలాభౌ అనగా లడ్డూలలో ద్రాక్షలు గాని పకోడీ లలో ఉల్లిపాయలుగాని లభించినా లభించకపోయినా, జయా జయౌ నీకు చాలా సయించినా సయించకపోయినా చలిం చక ఏకగుణంతో ఉండి, తతఃతరువాత, యుద్ధాయ అనగా లడ్డూపకోడీ లకాయికి, యుజ్యస్వ అనగా తయారు కావోయ్ అబ్బాయీ! నైనంపాపం అవాప్స్యసి అనగా ఇల్లాచేస్తే నిన్ను చీమంతైనా పాపం చుట్టుగోదు"—అని.

మాతమ్ముడు—నాకు చాలా చాలా వడ్డించమని అడగడం సిగ్గు అన్నయ్యా!

నేను—అప్పుడు నువ్వు వడ్డించే ఆయనతో, "ఇల్లా రవ్వ విడపండి" అని విస్తట్లో వెలుపెట్టి చూపించి, వేలు అల్లానే ఉంచి, ఒరిగి పక్కపంక్తిలో ఉన్న ఎల్లయ్యగారితో రాచకార్యం ఉన్నట్టు పెద్దవాక్యం మాట్లాడుతూండు. కావ లిసినంతా పడ్డవయినం కీగంట గమనించి, అప్పుడు నువ్వు సరిగ్గా తిరిగివడ్డించే వాడిమీదతమాషాగా ఖస్సుమను, వడ్డన ఆలస్యం ఎప్పుడేనా అయితే, ధప్పళం ముక్కలు పరామ ర్శించు. అందుకనే అవి పెద్దసైజులో ఉండడం. ఫీలైనప్పు డల్లా "గెడ్ పత్" చేస్తూండు—అనగా మిశ్రమం, ఒక

వేళ పచ్చిమిరపకాయ తెప్పించి ఉప్పులో అద్ది కొరకొచ్చు. ఆ పనినే పప్పులో పచ్చిమిరప 'రెడ్ విత్' సాల్ట్ యాక్టు అంటారు. అల్లానే పప్పు రెడ్ విత్ ధప్పళం! మా ప్రెసిడెంటు గారు ఇల్లాంటి నూతన దాంపత్యాలు అనేకం కనిపెట్టి ప్రపంచానికి కళ్ళు తెరుస్తూంటారు! జిలేబీ విశేషంగా తినేటందుకు వీలు ఏర్పడడానికి వారు జిలేబీ రెడ్ విత్-మజ్జిగపుల్స్! అనేది స్వానుభవంమీద కనిపెట్టారు. అన్నట్టు మరిచిపోయాను, చేతికి చాలా జిడ్డు పట్టుగుంటే వీలునుబట్టి కాళ్ళకో గడ్డానికో పట్టించు.''

సంగతులు

౧. ఒకానొక జైలులో ఉన్న ఒక మగఖైదీని చూడడానికి అనుజ్ఞ కోరుతూ ఆఖైదీ పెళ్ళాం దరఖాస్తుచేసింది. అనుజ్ఞ కాలేదు. కొన్నాళ్ళకి ఆ ఖైదీయొక్క స్నేహితుడు ఒకాయన ఖైదీని చూడడానికి దరఖాస్తు చేసాడు, అనుజ్ఞ ఇచ్చారు, చూశాడు. మళ్ళీ కొన్నాళ్ళకి ఆఖైదీ భార్య చూడడానికి అనుజ్ఞకోసం దరఖాస్తు చేసింది. అనుజ్ఞ ఇచ్చారు కారు. మన్లో మనమాట, రెండోసారి వెళ్ళి చూసిన మొగాడు, ఆవిడేట! వేషం! పగలుట!

౨. 'బొంబాయిలో పగటిచుక్క కనపడిందిట. అది అసలు చుక్కే! తెల్లారకట్లవచ్చే చుక్కని చాలామంది ఎరు

గదు. అసలు తెల్లవారకట్లవాళ్ళు అనేది చూడరు. ఆచుక్క కాంతికి నీడ ఉంటుంది. అదిసాలుకి రెండునెల్లపై చిలుకు అల్లా పొడుస్తుంది. ఆ కాలంలో అది సూర్యోదయం తర్వాత గుడా కనిపిస్తుంది. ఈ వేళ ౧౦ గంటలకి నే చూశాను' అని మానితేఖరి వ్రాశాడు. పగటి చుక్కకి ఇంతపట్టింపు ఎందు కన్నాడు ఒక ద్రావకప్రియుడు.

౩. 'లాటీ' అనేజతువుయొక్క జననాభివృద్ధిక్రమాల గురించి రిసర్చిచేసి పర్యవసానం తేల్చడానికి ఒకచోట ఒక కమిటీ పెట్టారు. ఆ కమిటీవారికి పొసగక వారు రెండింటి కింద చీలిపోయారు. ఒకరు ఇంగ్లీషునా ఒకరు తెలుగునా ఆలోచించారు. ఇంగ్లీషు ఆలోచనపరులు అన్న దేమిటంటే,

లాటీ అనే దాన్లో ఉండుకున్న వస్తుతత్వం కర్ర— అనగా ఇంగ్లీషులో (వుడ్)! ఈ 'వుడ్' ఉన్నప్రదేశమే లాటీ యొక్క జన్మస్థలం. ఈ 'వుడ్' ఎక్కడెక్కడ ఉందంటే— వెడ్జ్‌వుడ్ బెన్ను అనే పేరుగల ఇండియామంత్రిలోనూ, H.E. ఎడ్వర్డు ఫ్రిడరిక్ లిండ్లేవుడ్ అనే స్వంతపేరుగల రాజ ప్రతినిధిలోనూ H.E. బర్డు వుడ్-అనే పేరుగల్గి వెళ్ళిపోయిన ప్రధాన సేనానిలోనూ, ఉంది. ఆమాటకొస్తే H.E. చెట్‌వోడ్ అనే పేరుగల ప్రస్తుత ప్రధానసేనాని పేరులోకూడా చాలాభాగముంది.

ఇక తెలుగు కమిటీవారలో కొందరు చెప్పిందేమిటంటే ఆలా ఈలా కాకుండా సిసలైన తెలుగు "లా" అనేదానికి

'టీ' పార్టీ పరమైనప్పుడు, ప్రయోగరీత్యా 'లాటీ' సిద్ధిస్తుంది.
——అని.

మరికొందరు అది అసలు 'లాతీ' గాని 'లాటీ' కాదన్నారు. అనగా లా=లాఅనేది, తీ=తీసెయ్ అని. అంటే నీ లా తీసెయ్. నా లా తీస్కో అని అన్వయించారు.

౪. ఒకమునిసిపాలిటీలో ఉండే చాలానూతుల్లోమూడునాలుగుమాత్రమే అదృష్టంకొద్దీ బాగుపడ్డాయి. ఎంచేతంటే, వాటిల్లో మనుష్యులు పడి చచ్చిపోడం మూలాన్ని నీళ్ళు తోడించేసి, బురదా, మరి లోగడ పడిపోయినవాళ్ళఎముకలూ వగైరాలు పైకిలాగించెయ్యడంచేత. తక్కిన వాటిల్లో కూడా ఎప్పుడు మనుష్యులు పడుదురా, ఎప్పుడు అవి బాగు చేయించి పుణ్యం కట్టుకుందామా అని మునిసిపాలిటీవారు శక్తివంచన లేకుండా నిరీక్షిస్తున్నారు. పురుషుల్ని తీసెయ్యండి. స్త్రీలైనా నడుం కట్టి ముందుకి అంగ వెయ్యరా అని వారి ఆశ.

౫. ఓ పట్టాన్ని ఏ ఉద్యోగమూ కాని ఈకాలములో, చాలామందికి, అయాచితంగా, వర్ణవివక్షతలు లేకుండా, ఆశ్రయింపులూ, సిఫారసులూ, లంచాలూ లేకుండా, అవడం గొప్ప శుభసూచన. ఏవీ అంటే, మన సెన్సస్ ఉద్యోగాలు. కొందరు ఇంగ్లీషు తిన్నగా రాకపోయినా, 'జనాభా లెక్కలు' అని వాడితే తేలికగా ఉంటుందని, ఏతప్పుడుగానో ఇంగ్లీషే వాడుతూంటారు. 'మీకు సెన్సస్ ఉన్నాయిటండీ!' అని కొందర్ని అడుగుతూంటే అవతలవారు 'లేవండీ' అంటూండడం వినిపిస్తూంటుంది.

౬. ఆర్. టి. సి. (R. T. C.) యొక్క (అనగా రాజమండ్రి ట్రైనింగు కాలేజీ కాదు, రౌండు టేబిల్ కాన్ఫరెన్సు) ధోరణి చూస్తే అది మంచి రసకందాయప్పట్టులోనే జరిగింది. ఆ రసం యొక్క వయినం:—అక్కడికి స్త్రీలనికూడా పిలవడం, అదో శృంగారం. ఒకళ్ళు వెడతారనుకున్నది మరొకళ్లు వెళ్ళడం హాస్యం. ఒక అఖండుడు మరణించడం కరుణం, ఇండియాకి ఇంకా ఏమిచ్చారో తెలియకుండానే, అంతా ఇచ్చేసేవా అని మేక్డోనాల్డుగారిని చర్చిల్ కంపెనీవారు కోప్పడడం, రౌద్రం. ఇంగ్లండులో లెప్టునింగు లేబరైట్లు చేస్తూన్న ప్రయత్నం వీరం: ఆ సమయంలోనే, కర్మవశాత్తూ కొందరు తీసుకుంటూన్న చర్యలు భయానకం. ప్రజల్లో కొందరి స్థితి భీభత్సం. సైమన్ జట్టు వారి పంచాంగం మూలపడేశాం అని పైకి అని అందులో చెప్పినప్రకారమే క్రియలు జరపడం, అద్భుతం. వెనకనించీ ఇండియాలో కోరుతూన్నదీ, ప్రస్తుతం ఇంగ్లండు నించి వారు కోరుతూన్నదీ శాంతం.

౭. ఓ పెద్దమనిషి ఓ అబ్బాయికి ఓ పెళ్ళిసంబంధం తప్పించెయ్యాలని బయలు దేరి, వాణ్ణి నిరసిస్తూ, పిల్ల నివ్వదల్చిన ఆయన దగ్గిర ఇల్లా అన్నాడట :—

అయ్యా! మీరు పిల్ల నివ్వదల్చిన వాడికి 'మెరా మాలాబులా' అనేపాటకూడా రాదు. వాడు గయోపాఖ్యానం ఎరగడు. వాడు తెలుగు క్లాసులోకూడా అల్లరి చేయలేదు

వాడు ముందు ముందుకి మేస్త్రీ(స్త్రి)నింగు కేనా పనికిరాడు. అతణ్ణి రొండు టేబిల్ ట్రాన్స్ఫరెన్సు కేనా పంపడానికి వీల్లేదు, చివరికి.

౮. ప్రస్తుతం ట్రేడ్ డిప్రెషన్ లో ఉన్నాం అనగా వర్తక మాంద్యం, అంటే డబ్బు కాటకం. దేనికైనా సరే సమాధానాలు చెప్పి పారెయ్యడానికి ఇది ఓ పెద్ద కారణంకింద ఏర్పడింది. ఈమధ్య ఓకుర్రాణ్ణి "ఏం అబ్బాయి, లేట్ గా వచ్చావేం?" అని మేష్టరు అడిగితే, "ఏం లేదండి. ట్రేడ్ డిప్రెషన్ గదా!" అన్నాట్ట. మేష్టరు "అప్రస్తుతంగా మాట్లాడక సరియైన సమాధానం చెప్పు!" అన్నాడట. అంటే కుర్రాడు, "నిజమేనండీ, సార్! ఇదివరకు చేతులో డబ్బాడుతూంటే జట్కామీద వచ్చేవాణ్ణి, ఈ వేళ నడిచివచ్చాను, లేటయింది" అన్నాట్ట! తన రాబడినిబట్టి చూసి, "డబ్బు కాటకంవల్ల, రోగాలు తగ్గిపోయినాయి" అన్నాడు ఓ డాక్టరు. "రోగాల సంఖ్య తగ్గలేదూ! డబ్బుకాటకంవల్ల రోగాలు ఇంటిదగ్గిరే కుదిరి పోతున్నాయి" అని వాగి స్నేహితు డన్నాడు. దీనికి కారణం, పదణాలవెండి మాత్రమే గల మన రూపాయే అని కొందరంటారు. కొందరు, అసలు ఈ తెగులు ప్రపంచానికే వచ్చింది, ఇండియాకి మాత్రమే కాదన్నారు. కొందరికి ఈ సంగతి ఇల్లా వస్తుందని అయిదేళ్ళక్రిందటే తెలుసుట, మనతో చెప్పారట, మనం వినిపించుగోలేదు. ఏమైతే? వస్తువు ఉన్నవాడినోట్లో మట్టి.

ఈ మధ్య ఓ ఆయన క్షౌరం చేయించుకుని మంగలాడికి పదహారు కొబ్బరికాయలు ఇచ్చాడు. ఋణదాతలు ఋణస్థుల్ని నిక్కచ్చి చేస్తున్నారు అంచేత ప్రస్తుతం అన్నీ చవక అయి నట్టే, దివాలాలుకూడా చవక అయినాయి. ఇదివరలో కొన్నేసి వేలకే దివాలాలు గాని, ఇప్పుడు కొన్ని కొన్ని వందలకే టంకసాలల్లో రూపాయలు కొట్టించి దేశంమీద చిమ్మిస్తే డబ్బు జబ్బు కుదురుతుంది అని ఒకాయన అన్నాడు. కొందరు, మాస్టారం టేసరి, ధరలు వాటంతట అవే పెరుగుతాయి అన్నారు. అని "ధర తగ్గుట హెచ్చుకొరకే" అనేది ప్రమాణంగా ఇచ్చారు.

౯. ఆంధ్రా యూనివర్సిటీ స్థలనిర్ణయం రెండింటిలో బయల్దేరి, మూడు మీరించి నాలుగులోకి వెళ్ళింది. నాయకత్వానికి పోటీ ఇద్దరితో మాత్రమే బయల్దేరింది. ఇదికూడా ముగ్గుర్లోకీ వెళ్ళిందా, నలుగుర్లోనూ పడింది దన్నమాటే!

౧౦. ఒక పల్లెటూరి శాస్తుల్లుగారు, పట్నవాసపు చుట్టంతో మాట్లాడుతూ :—

శా—చూడండీ! శాం దాభిల్లుడుగారు కులాసాగా ఉన్నట్టా?

చుట్టం—ఆ. ఏం?

శా—ఆయనది మహాగొప్ప ముందుచూపు

చు—ఏం? ఎల్లా కనిపెట్టారు?

శా—ఆయన అప్పుడు శాసనం చెయించకపోతే,

అన్ని పెళ్ళిళ్ళు అప్పుడు జరిగి ఉండవు. అప్పుడు గనక జరిగి ఉండకపోతే, ఇప్పుడు, డబ్బు కాటకం మూలాన్ని అసలే జరక్కపోను.

చు—చిత్తం. ఏమిటి సెలవు?
శా—ఆయన గట్టివాడే!
చు—తమరి అనుగ్రహం!

౧౧. ఇండియా లో డబ్బు కాటకం గురించి ఆలోచించి సలహా చెప్పడానికి "సాల్టరు" దొరగారు వచ్చారు ఇంతమంది ఉండగా 'సాల్టరు' వారే ఎందుకు వచ్చారంటే: ప్రజల్లో తగాదా ప్రారంభం "సాల్టు" తో అయింది గనక ప్రభుత్వం వారు ఓ డిగ్రీ పైన ఉండడానికి "సాల్టరు" గారిని పిలిపించారు.

౧౨. షణ్ముఖం అనే ఆయనకి ఈమధ్య లాటీదెబ్బలు తగిలాయిట. అతనిమీద పోలీసువారు అక్రమ సంఘం (అన్ లాఫుల్ ఎసెంబ్లీ) నేరం మోపారట. అతడొక్కడే ఉన్నాడని పోలీసువారు కూడా ఒప్పుకున్నా, అతనిపేరులో అయిదు కంటె ఎక్కువ ఉంది గనక అతనిమీద ఆ కేసు పెట్టవలిసొచ్చిందని సెలవిచ్చారట.

## విద్యార్థుల ఏకాంతపు రిమార్కులు

కొంతకాలం కిందట ఒక వేసంగిలో ఆంధ్రదేశపు కాలేజీ విద్యార్థుల సమావేశం మహాపురంలో జరిగింది. ఒక పెద్దభవనం బసకి మాట్లాడి దానిచుట్టూ పందిళ్ళు వేశారు. చాల

మంది విచ్చేశారు. ఉన్నతాదర్శాలతో భోజనవసతి ఏర్పాటైంది. అట్టెండెన్సుల నియమాలం గురించీ, పరీక్షల నాశనం గురించీ, నాసిరకపు మేష్టర్లని తీసెయ్యడం గురించీ, కీర్త్రైన తీర్మానాలు ఆమోదింపబడి గ్రంథస్థం చెయ్యబడ్డాయి. రాత్రిళ్ళప్పుడు పందెళ్ళక్రింద చాపలేసుగుని విద్యార్థులు గుంపులు గుంపులుగా జేరి ఇష్టాగోష్ఠి మాట్లాడుకుంటూ ఉండేవారట. మా సన్నిహితుడైన ఒకవిద్యార్థి ఆ వయినాలు యావత్తూ చెప్పిన మీదట మాకు తెలిసింది. కొందరు అశ్లీలాలే మాట్లాడుకునే వారట. అవి మినహాయించేశాం. కొందరు నిందావాక్యాలే అంటూరుట. అవీ విడిచిపెట్టాం. ఒకచోట మాత్రం చదువుల గురించే ముచ్చటిస్తూ, అధ్యాపకుల ప్రత్యేకత్వాలు స్థాపించే లక్షణాలు చెప్పుకుంటున్నారట. అధ్యాపకుల్లో ఎవరూ అప్పుడు అక్కడ లేకపోవడంవల్ల ప్రతీ వాడూ దాపరికం లేకుండా మనస్సులో ఉన్నది అనేశాడుట. వాళ్ళు తమ సంభాషణల్లో యాదాలాభంగా ప్రయోగిస్తూండేటన్ని ఇంగ్లీషు ముక్కలు ప్రయోగించకుండా ఆ భావాలు మాత్రం గమనిస్తే, ఈ క్రిందిమాదిరిని ఉంటాయి:—

ఒకడు—హారిబుల్ అని ప్రిన్సిపాల్తో మొదలెడదాం.

రెం—నిజమేనండీ. మా ప్రిన్సిపాలు గవర్నరులా ఉంటాడు.

మూ—సరే! మా ప్రిన్సిపాలు మట్టివిఘ్నేశ్వరుడులా ఉంటాడు. ప్రిన్సిపాలు పద్దు పెద్దపద్దూ! ఆ పద్దు చివరకి అట్టే పెట్టి ముందు కడంవి కొట్టేద్దాం'

నా—మా ఫిలాసఫీ మేష్టరూ......

రెం—ఇంకా ఇక్లేగా అలక్కుండా మొదట్లోనే శుభ మల్లా ఫిలాసఫీ ఏమిటయ్యా! కొంచెం శాంతించి వ్యవహరించు. అసలు ఫిలాసఫీ ఓ గ్రూపేనా పులిహోరా ఒక పిండి వంటేనా! చివర చివరకి ఫిలాసఫీ!

నా—మీరు ప్రతీదీ నిలువునా చీరి అడ్డంగా నరికేలా ఉన్నారే! మీరే కానివ్వండి.

రెం—మా సైన్సు మేష్టరు బి. యే. ప్రెసిడెన్సీ ఫస్టు. అనగా ఎం. యే.! ఆచరణభాగంలో ఆయన నిధి. ఆయన అరచేతులు అరిగి ఉన్నాయి. ఆయనకి మిఠాయి ఉండలు ఇష్టం. ఉండ ఖళంగా నోట్లో వేసుగుని నొక్కడం ఆయనకి అలవాటు. తద్వారా, ఆయన, బ్రహ్మ ప్రెస్సు గురించి ఏదో ఒకవిశేషం కనిపెట్టాడు. అందుకు ఓ కంపెనీవాళ్ళు ఆయనకి ఓ పాతిక వేలు పారేశారు.

అ—మా వాడూ వచ్చి ఒక పుస్తకంతీసి తెగ చదువుతాడు. నోటంట వేరే స్వంతముక్క ఊడిపడదు. కుర్రాళ్ళ కేసిచూస్తే ఆయనకి భయం, బోర్డుకేసి తిరిగి ఉన్నప్పుడు ధైర్యం.

ఆ—మా వాడికి తెలుగు రాకపోవడంవల్ల ఎవడేనా తెలుగుని మాట్లాడితే తన్ను తిట్టడం అనుకుని ఫైన్ తగిలించేస్తాడు. సైన్సు డిపాజిటు కిందకట్టిన మూడురూపాయిల ధరావతూ మొదటి మాసంలోనే చాలామందికి ఆఖరు.

మొ—మా సైన్సు మేష్టరు ప్రైవేటుక్లాసులు తను బాధపడి ఇంకోర్ని బాధపడితేగాని ఆయనకి తోచదు! ఒక్కొక్క ఘట్టంలో చెబుతూన్న అంశం కుర్రాళ్ళకి తెలియదు. ఆయనకీ తెలియదు. ఏమన్నా అంటే 'నాకు పుస్తకం కంఠతావచ్చును. రాసినవాడికి కూడా ఇంత కంఠం తెలియదని చెవికదపాయిస్తాను' అంటాడు.

మూ—మా మేష్టరు సాధారణంగా క్లాసుకి రాడు. దర్జా! పాఠం చెబుతున్నా చుట్టకాల్చడం మానడు. అయితేం, కొన్ని మాసాల్లో మామూలువాళ్ళు చెప్పేవిషయం అంతా ఒక్క లెక్చర్లోనే మళ్ళీ చూడక్కర్లేకుండా చెప్తాడు.

అ—మా వాడికి ఆట్టేసరుకులేదు. ఉన్నదమాత్రం అంత అద్భుతంగా ఎవ్వడూ చెప్పలేడు. ప్రాక్టికల్‌లో వస్తువులు మాత్రం స్వంతాస్తిలా చూసుగుని నల్లపూసంత రాలుస్తూ ఉంటాడు.

ఆ—మా మేష్టర్ని ఈమధ్య బదలాయించేశారు. వెంటనే మాకు శాస్త్రపాఠాలు సుగమం కావడం ప్రారంభించాయి.

నా—మా లెఖ్ఖల మేష్టరు చదరంగంలో ఘస్తు, అష్టం, చెస్సు తణిఖీ చెయ్యాడు. కుర్రాళ్ళకి లెక్క ప్రయత్నించడానికి యిచ్చి ఆ కాస్తవ్యవధిలోనే సరికొత్త ఇంగ్లీషునవల చదువుతూంటాడు. అతడు వేసిన లెక్క రాకపోవడం ఎవ్వరూ ఎర

గరు. ఏదేనా చిన్న లెక్క అంతగాగాని పేచీపెడితే జీక్క పొమ్మంటు పీక్చేసరికి ఆన్సరు ఊడి పడిందన్నమాటే!

ఏ——ను. మేష్టరు బుక్కులో లెఖ్ఖలు నాలుగు బాగా రుక్కేసుకు వస్తాడు. అందులో నోటి నిమ్మళంగా బోర్డు మీద రాయబోతూండే సమయానికిగాని ఎవడేనా కాస్త దగ్గితేసరి, అది చెయ్యడపుపద్ధతి కాస్తా మరచిపోతాడో కర్మమో, కొప్పడి, ఆ కుర్రాణ్ణి ఇంటికి పొమ్మంటాడు. అంచేత ఏవడేనా కుర్రాడు ఇంటికి పోవాలంటే దగ్గితే సరి.

అ——నా మేష్టరు తను చెప్పే లెఖ్ఖ ఏ పేజీలో ఉందో ఆ పేజీలో వేల్తో పుస్తకం పట్టుకుని వస్తాడు. రేఖాగణితంలో బొమ్మ వెయ్యడానికి పుస్తకం బల్లమీద బోర్లిస్తాడు. బోర్లించకుండా మామూలుగా పెడితే గాలికి పేజీలు తారు మారైతే మళ్ళీ పట్టుగోడం కష్టం. బొమ్మ వేస్తాడు. ఎవరేనా 'నాకు తెలియడం లేదండి' అంటే 'నాకూ తెలియడం లేదోయ్, చిత్రంగా లేదూ! మాగొప్ప లెఖ్ఖ!' అంటాడు. ఆ బొమ్మలో ఎవడేగీతలు ప్రతిపాదిస్తే ఆగీతలు గీస్తాడు. మొత్తంమీద, బొమ్మ, పచ్చిసుగుళ్ళలా తయారై గంట అఖరవుతుంది. కాని, ఏది ముఖ్యం అంటాడో అదే పెద్ద పరీక్షలో వచ్చి తీరుతుంది.

అరు——నా బాకు మన్మథ విగ్రహం. ఇంగ్లీషు మాట్లాడ్డం గంటకి 60 మైళ్ళ రేటు. వస్తానే, పుస్తకంలో ఏదో పేజీ

తిత్తుక్కమని, ఒకటోలెఖ్ఖ చప్పరించి. రెండోది చూడమని, మూడోది తను నోటంట అంటూ నాలుగోది బోర్డుమీద వేసి ఉయిదోలెఖ్ఖ ఆధారం వల్ల, ఆరో లెఖ్ఖ అన్సరు నోటిసి చెప్పమంటాడు. కుర్రాడు ఏడవాలి. లెఖ్ఖలమాట ఎలాఉన్నా గాని, మనిషీ మాటా చాలు, కడుపు నిండుతుంది.

రెం—మా లెఖ్ఖల మేష్టరు-పండు, అగ్ని, పొట్టి విగ్రహం. పిల్లినడక! ఏకారంగా చుట్టినా అందంగా ఉండే తలపాగా! ఇంగ్లీషు మాట్లాడ్డం నేర్చుగోడానికి దొర్లు ఆయన్ని ఆశ్రయించాలి. అంతగుచ్చుగునే చూపు ఎక్కడా ఉండదు, సింహం చూపు! పాఠం తయారీలేని రకాలకి గంటంతా తల వంపే. ఓ గంట ఆయన చెప్పడం వింటే ఆరుగంటలు విడిగా ఇంటిదగ్గిర కూచుంటేగాని విన్నసంగతులు తెలివిగలవాడు కూడా హారాయించుగోలేడు. తొణకడు. తిడుతూన్నా దీవిస్తూన్నా మొఖంలో మార్పు ఉండదు. ప్రజ్ఞ అమోఘం. శాస్త్రం ఆయనకి హృత్కవిలి. హృదయం నవనీతం. తూలనాడ్డం ఎరగడు. కాని చంపేస్తాడని అందరికీ భయమే. బ్రహ్మరుద్రుల్ని లక్ష్య పెట్టడు.

మూ—మా హిస్టరీమేష్టరు దొరలాగ టీక్ గా ఉంటారు. దొరసాన్ల సరసనికూచుంటే ఆయన్ని దొరే అనుకోవాలి గాని గత్యంతరంలేదు, ఆయన ఇంగ్లీషు ఎం. యే. కి అయిదుసార్లుకట్టి ఫేలై విసిగెత్తి చివరికి హిస్టరీకి కట్టి లటక్‌మని ప్యాసయారట. పెదిమి కదలకుండా మంచి ముత్యాలు

రాల్చినట్లు పదాలు దొర్లిస్తూ, హిస్టరీ వృత్తాంతం ఈక్షణో క్రమమూ లేని అఖండ వాక్యాలు అనేస్తాడు.

మొదటి—మా మేష్టరు, కర్మదశ! నోట్సు నోట్సు నోట్సు! వాటికి అంతూ ఆఖరూ లేదు—ఒక్కొక్కప్పుడు దారీ తెన్నూ ఉండదు ఇక్కడికిఅరున్నొక్క రెండు బుక్కులు అయి నాయి, ఇంకా ఎన్ని పడతాయో తెలియదు. చాలా పుస్తకాలు తణిఖీచేసి, తను ఓ పెద్ద బైండుబుక్కులో నోట్సు రాసు గున్నారు. అందులో ప్రతీరోజూ లెక్చరు ఆఖరుకాగానే (లెక్చరంటే డిక్టేషనే—ఆయన డిక్టేటరే!) ఆ తారీఖేసి సంతకం చేసుగునేవాడు, నిరుడు ఆ తారీఖున సంతకం ఎక్కడుందో, ఈయేడు కూడా సరిగా అక్కడికే అయి అక్కడే సంతకం పడాలి. ఎక్కడేనా నిరుడు చమత్కరిస్తే, ఈ యేడుకుడా అక్కడే చమత్కరించడం కూడా నోట్సే! లేక పోతే నాలిక తెంపుగునేవాడు. ఓమాటు మాకు రాతంటే రోతపుట్టి ఆయన తాలూకు పెద్దబైండులాగేసి దాచేశాం. దాంతో మాకు వారం రోజులు సెలవొచ్చింది.

నా—మా మేష్టరు పిడుగు! దేశాన్నిబట్టి చరిత్ర చెప్పి ఊరుకోక, కాలాన్నిబట్టి చెప్పేస్తాడు. ప్రతీపాఠం కుర్రాళ్ళకి కంఠపాఠమే. బడుద్ధాయిల్ని దిమ్మదిరిగేస్తాడు.

అయి—మా హిస్టరీమేష్టరు ప్రిన్సిపాలు తరాయి స్తూంటాడు. ఓమాటు ప్రిన్సిపాలు వెళ్ళి ఏదోక్లాసుకి ఆయన్ని అటెండెన్సు వెయ్యమన్నాడు. ఈయన 'అది నా

పనేంకాదు' అని పక్కకి తిరిగి జవాబు చెప్పాడు. ఈయన రోజూ ప్రిన్సిపాల్‌కి పోలీసుల్లాగ అవసరమాత్రంగా గుడ్ మార్నింగ్ పెడుతూంటాడు. ప్రిన్సిపల్ ఓనాడు సైన్సు మేష్టరు దగ్గిరికెళ్ళి నడుం వంచి తనేమూను 'గుడ్ మార్నింగ్' అన్నాడు. తరవాత రోజున ప్రిన్సిపాలు బండిమీద వస్తూంటే, ఈయన వెళ్ళి, ప్రిన్సిపాల్ని పేరెట్టి పిల్చి, నేలమీద చెయ్యి ఆనుకుని గుడ్‌మార్నింగు పెట్టి, ఒకటి, రెండు, మూడు (అన్నట్టు అభినయించి) 'చాలా? తృప్తి అయిందా? ఇదేనా నమస్కారం పెట్టేరీతి!' అన్నాడు. దాంతోనింక ప్రిన్సిపల్ ఆగిపోయారు.

మా—మా ఇంగ్లీషు మేష్టరు వచ్చేసరికి సాధారణంగా డబడబలబ్బు జరుగుతుంది. అట్టెండెన్సు వెయ్యగానే కుర్రాళ్ళు కిటికీల్లోంచి దూకి పాకి జారి సన్నగిల్లి శాల్లోంచే తులా అవతల పడిపోతారు. నేనోనాటు, ఆయన తనపాఠం మొదలెట్టిన తరవాత, 'నేను ఒకసారి బయటికి వెళ్ళాలండి' అన్నాను. ఆయన సరే అన్నాడు. నేను ఆరోజుకీ మళ్ళీ రాలేదు. మర్నాడు 'నువ్వు మళ్ళీ నిన్న రాలేదే!' అని రాగానే అడిగాడు. నేను మళ్ళీ వస్తానని చెప్పలేదు అనేసినాడ్చేశాను.

నా—మా యింగ్లీషు మేష్టరువాక్కు మంచినీళ్ళప్రవాహం. నాలుగు గొంతికలు వినిపిస్తాయి. బ్రహ్మాండవాడు. ఒక్కముక్క బోధపడదు.

అ—మా మేష్టరు ఊహామాత్రేణువులు ఇంగ్లీషు ఏమీ బాగుండదు అభిమానపదాలన్నీ బజాయిసరుకు. మాట్లాడు.

తూంటే కూడా ఆయనకి స్పెల్లింగు తప్పులే. చాలా కొంచెమే రాసుకోమంటారు, అది బాగాగమే.

రెం—హూ మేష్టరు ఆవలి తెలుసు. చాలాను స్త్రీ. వాక్యా పూర్తి అయ్యేసరికి కర్త మరిచిపోతాం. అసలు ఒక వాక్యం పూర్తి చేసేలోపల ఉమ్మెయ్యడం తప్పకడం పనులన్నీ నాలి లోక చేసేస్తాడు. డబ్బై భ్రష్టులు పరీక్షముందు, అన్సర్లతో సహా మాచేత రాయిస్తాడు. విత్తప్ప కడంవి పరీక్షలో సిద్ధం అవుతాయి. కాని, ఆ సంగతి పరీక్ష తరవాతగాని తెలుస్తూండదు.

నా—సూక్ష్మ ఇంకో మేష్టరున్నాడు. ఆయన సహస్రాక్షుడు. ఆ సంగతి నాకు తెలియక నేను ఓనాడు ఆయన పాఠం మొదలెట్టగానే వెళ్ళిపోతానని అభినయించాను. ఆయన, 'ఆ అభినయం ఏమిటి?' అన్నారు. లెక్చరుకి అడ్డు రావడం ఎందుకని అల్లా చేశానన్నాను. ఆయనకి కోపం వచ్చింది. మర్నాడు క్లాసులో మాంగది తలుపు గాలికి కొట్టుకుంటూంటే ఆయన దాన్ని బిగించమని నాకు పని చెప్పాడు ప్యూన్‌తో చెప్పండి అన్నాను నేను. 'నిన్ను మాడ్చెయ్యగల్ను ఒక్క గీటుతో, తెలుసునా? నీకు పేపరిచ్చేది నేనే!'. అన్నాడు. దాంతోటి నేను ఆ తలుపు బిగించి రావడమే కాకుండా కడవి అన్నికూడా చూసొచ్చాను, ఎందుకేనా మంచిదని.

అ—మా ఇంగ్లీషు మేష్టరు భాష ఆంగ్లసారస్వతంలో కల్లా సిగ్గు.

ఆరు—మా మేష్టరికి నేనోసారి బైబిలూ పూత రేకులూ బహుమతీ తీసిగెళ్ళేసరికి తరుంకొచ్చాడు.

మొద—మా ఇంగ్లీషు మేష్టరు ఇంగ్లీషు లెక్చరంతా తెలుగునే కానిస్తాడు. ఆయన ఇంగ్లీషు మాట్లాడుతూంటే తెలుగులా ఉంటుంది, తెలుగు మాట్లాడుతూంటే ఇంగ్లీషులా ఉంటుంది. ముఖం ఒక గ్రంథం, నాలిక ఒక ఘంటం అన్నంత గ్రాంథిక భాష ఆయనకిష్టం. కుర్రాళ్ళని అప్పుడప్పుడు మందలిస్తూంటాడు. 'మీనాన్న పంపిన మనీ అల్లా ఎందుకు బరన్ చేస్తావ్ అబ్బాయి!' అన్నాడు ఓ కుర్రాణ్ణి. "మనీ ఆక్సైడ్. అనే భస్మం తయారు చెయ్యడానికండి" అన్నాడు వాడు, 'ఇందులో ఉన్నాయి మన తెలివి తేటలు. ప్రిన్సిపల్ నేటివ్ అయినంత మాత్రాన్ని నువ్వు లెక్చరర్లని ధిక్కరించడం పనికిరాదు' అన్నాడు. ఇంగ్లీషునాటకం బోధించే సమయంలో ఎక్కడేనా గొప్పవాక్యాలు వచ్చినప్పుడు ఆయన ఆవాక్యాలు దొరక పుచ్చుకుని వ్యాఖ్యానం చెయ్యలేక, ఆవాక్యాలు చదవడం మాత్రం చదివి సులోచనాలుతీసి బల్లమీద పారేసి, 'అద్భుతమైన భావాలు, అఖండమైన ఆలోచన! మరి తర వాత పంక్తులు చూద్దాం' అని ముందుపంక్తులు చదువుకు పోయేవాడు.

రెం—మా తెలుగుమేష్టరికి ప్రిన్సిపల్ అంటే హడల్! ఆయన రాగానే కుర్రాళ్ళు తలుపులు వేసేస్తారు. కుర్రాళ్ళని రాపాకులా కూచోమని వాళ్ళకంటె గోలగా మాట్లాడతాడు.

మొ——గారి మేష్టరు అయిదు నిమిషాలు పాఠం చెప్పి ఆనాటినిమిషంలో తను రాసినపుస్తకం దగ్గరికి వస్తాడు. ఆయన రాసి దిటువా అవోకటి. ఎవడో ఒకడు అందులో పద్యం ఒకటి తీసి దాని అర్థం తెలియదు చెప్పమని ఆయన్ని ప్రార్థిస్తాడు——బహుశా ఉన్న వాళ్ళలో ఎవరికీ తెలియదనుకొనక. ఆయన నగంచప్పి, 'అప్పుడు దేవి ప్రాయించినది. ప్రాసినాను. ఇప్పుడున్నానో!' అనేస్తాడు. ఆయన పేపరు దిద్దితే అంతా స్కానే. ఓసారి ప్రిన్సిపాల్ 'పరీక్షంటూ పెట్టేం తరవాత నూటికి కనీసం పదేనా ఫేలవద్దా!' అన్నాట్ట. అక్కణ్ణించి ఆయన పేపర్లు దిద్దేటప్పుడు పదోది, ఇరవైయోది, ఇల్లాగ్గా ఫేలుచెయ్యడం ప్రారంభించాడు. అందుకని, కుర్రాళ్ళు వారింటికెళ్ళి తమ పేపర్లు పదీ, ఇరవైయీ, ఇల్లాంటిస్థలాల్లో లేకుండా ఆయనచేతే సర్దించుకొంటారు.

మా——గారి మేష్టరు ఒక్కొక్కడికి తెలుగులో 39.9 మార్కులు వేసి పరీక్షకి కట్టకుండా ఆపుచేయిస్తాడు. ఆ కాస్తా వెయ్యండి పరీక్షకి కట్టేస్తానూ అని కుర్రాడు అడిగితే, 'నువ్వు తక్కిన 1కీ అనర్హుడవు' అంటాడు.

నా——గారి తెలుగు మేష్టరు తిట్టిచంపుతాడు. పైగా పేపరిస్తాడు. వాడ్నడిగితే ప్రమాదం. ఏ కవినీ ఒప్పుకోక ప్రతీదీ నేలకెట్టి కొడతాడు.

అ——గారి మేష్టరేమిటో తెలుసునా! సాయంత్రం వెళ్ళి అట్టెండెన్సు వెయ్యమంటే, 'ఊళ్ళో ఉన్నావ్ గా,

నీ కెందుకీ శ్రమా! కాకిచేత కబురంపితే వేసెయ్యను టోయ్!" అంటాడు.

ఆరు—మీపుణ్యంగనకా! మా మేష్టరు దేన్ని గురించి ఎవరిమీద అనుమానపడ్డా అందరికీ అప్లైండెన్సు కత్తిరిస్తాడు, పేపరిచ్చి పరిక్ష గోకేస్తాడు.

మొ—చివరచివరకన్నారుగనక, మరిఫిలాసఫీ. మా మేష్టరు నిదానంగా కూచుని, కుర్చీ అంచుమీద మెడ పెట్టి, అద్భుతమైన శైలిలో, దుర్భేద్యంగాఉండే అంశం పట్టుగుని, తనకంటెబాగా, వినేవాళ్ళకే, ఇదివరకే అది తెలుసునా అనిపించేటంత సుబోధకంగా, దేనికది విడగొట్టి చెప్తాడట. ఆయన దగ్గిర వినడాలేగాని రాసుగోడాలు లేవుట. సంగతులు మరచిపోడాలు లేవుట. కడంవిషయాల వాళ్ళు 'మేం ఫిలాసఫీయేనా తీసుగున్నాం కాదుగదా, ఈయన్ని వినడం పడడానికీ!' అని బాధపడుతూంటారు. మరి ప్రిన్సిపాల్సు!

రెం—మా ప్రిన్సిపాల్ కి ఏమీ అక్కర్లేదు. ఇల్లూ కాలేజీయే ఆయనలోకం, సెలవు సాధారణంగా యివ్వడు.

మూ—మా పిన్సిపాల్ ఏక ఆటలు.

సా—మా పిన్సిపాల్ కొంచెం టెన్నిసు ఆడతాడు. కాని, టెన్నిస్ బాగా ఆడే కుర్రాళ్ళని చూస్తే కోపం. డైరక్టరువచ్చి ఓమాటు టెన్నిసు ఆడదాం అన్నాడు. నేనూ డైరక్టరు ఓవేపూ, మా ప్రిన్సిపాలూ ఇంకో

మేష్టరూ అవతల వేపూ! తప్పనిసరివల్ల మా ప్రిన్సిపాల్ నన్నప్పుడు ఆడనిచ్చాడు. నేను ఒక్క స్మాష్ ఈడ్చి కొట్టాను. అది ప్రిన్సిపాల్కి తగల్లేదు కాని, అది ఆయన త్రియ్యబోయి పట్టాడు. కాలు గాచుకుపోయింది. నేను అది పొగరుతో కొట్టానుట, మర్నాడు నా ఫ్రీస్కాలర్‌షిప్పు ఊడదీసేశాడు.

అ——మా ప్రిన్సిపాల్‌కి అన్నీ కావాలి. కలకలలాడుతూంటే తీరిపోనా! నిత్యమూ కోడంటికం యోగీనూ! ఎప్పుడూ పరీక్షగోలా, మార్కుల రోదననున్నూ! సున్నా వస్తే పూజ్యుడంటాడు, కటాకటీగా మార్కులొస్తే ఇటూ అటూ కాని గబ్బిలం అంటాడు, బాగా వస్తే 'ఇంకా బాగా వస్తాయనుకున్నాను. నీకు పొగరు' అంటాడు. ఏమిఅన్నా అనకపోయినా పైనే నాటకపు రేట్లలాగ ఫైన్ రేట్లు కట్టేసి ఉంటాయి. పైగా 'సమయానుకూలముగా రేట్లు హెచ్చింపబడును.' నేను వెళ్ళిన కొత్తరికం క్లాసులో ఆయన నన్ను ఏదోప్రశ్న అడిగాడు. ఏదో పెద్దవాడు ప్రశ్న అడిగాడు. కాస్త పెద్దమాటతో సమాధానం చెబుతే దర్జాగా ఉంటుంది, పైపెచ్చు క్లాసులో కడంవాళ్ళకి నాయందు కొంత భయమేనా ఉంటుంది, అనుకుని. 'రెండజ్ వుజ్' అనేమాట నా ఆన్సరులో దొర్లించాను. అది 'రెండవూ!' అనీ పలకాలట, నాకు ఉచ్చారణలో రెండుతప్పు లొచ్చాయిట, అందుకని నాకు రెండురూపాయలు వొడ్డించాడు ఆ జరిమానా రశీదు మర్నాడు చూపెట్టమన్నాడు. మర్నాటికి అదికొంచెం చిరుగుపట్టింది. 'ఎంత అశ్రద్ధనీకు!' అని మళ్ళీ రూపాయి తగిలించాడు.

ఆ—మావాడు ఎన్ని కాంపోజిషన్లు కుర్రాడు రాయడో అన్ని రూపాయలు ఇప్పిస్త్యామంటాడు. చేరడానికి వచ్చినవాడొకడు 'ప్రిన్సిపాలు' అని ఉన్నచోట పొరపాట్న సంతకం చేస్తే, రూపాయి పైనేసి కొత్తదరఖాస్తుఫారం ఇచ్చాడు.

ఏ—మా ప్రిన్సిపల్ కి చాలాజాలి, ఎవరెప్పుడొచ్చినా చేర్చుకుంటాడు. పరీక్షకి కట్టించకపోవడం అంటే ఆయనకి మంట. డబ్బిచ్చి చదివినప్పుడు పరీక్షకి కూచోడం జన్మహక్కని ఆయన వాదన. మొత్తం మీద ఆయన అధికారి. కాలేజీ అనాథశరణాలయం, చిలక్కొట్టులకి స్వస్థలం.

అ—మా ప్రిన్సిపల్ బిడ్డలతండ్రి. పైన విద్యార్థుల్ని కూనా, కుంకా, మూర్ఖా, అంటాడు.

మా—మావాడు మేం ఏం చెబితే అది. మేష్టర్ల మాట ఖాతరీ చెయ్యడు.

ఆ—మా ప్రిన్సిపాలు అంతా యంత్రవతు. నాలుగింటికి-నవ్వు-అని కార్యక్రమం వేసుగుని అప్పుడే నవ్వుతాడు. నాలుగున్నరకి ఏడుపు, అంటే, అప్పుడే. దుష్టుడు మాత్ర కాదు. పైకి యముడు. తనవాళ్ళమీద ఈగ వాలనివ్వడు.

నా—ఒక్కొక్కప్పుడు మా ప్రిన్సిపల్ మా కేఅడ్డు. అప్పుడు మాకు మరీభయం.

ఎని—మా ప్రిన్సిపల్ అవతారం! చదివితే యమచమవు, తింటే రావణాతిండి, రాస్తే మొగావణ గాత, అంతా విపరీతం. కుర్రాళ్ళకి ఎంతకోపం వస్తే అంత నవ్వించే మాటకారి,

ఆయన పాఠం తయారీ ఓమాటే చేసేవాడు. చాలా ఫుష్టముండి పుస్తకం ఎంతమాత్రం చూడకుండా వచ్చేవాడు. ఆయన మాటలు మరి రత్నాలే! మహానుభావుడు! నా జీవితంలో ఏకాంతం చూసినా అది ఒక పెద్ద పుస్తకాల బీరువా అన్నమాటే! జేబులో చిల్లపెంకి చేతికెన్ని రాళ్ళయితే లాగేస్తే అన్నీకూడా దరిద్రుణ్ణి అన్న విద్యార్థి ప్రతివాడికీ ఇచ్చేస్తాడు.

రెం— { నిజమే! నిజమే! మహానుభావులు!
మూ— { రకరకాలు! ఇక కానుకాదాం!

[ఈ పైనఉన్న 'విద్యార్థుల ఏకాంతపరిమాణాల్యాలు' అనే విషయాన్నిగురించి మాత్రే రెండు మాటలు. 1897, 1906, 1918, 1927 సంవత్సరాల కాలాల్లో విశ్వకళాశాలల్లో చదివి బిగ్యూ పరీక్షకి వెళ్ళిన పలువురు విద్యార్థుల జ్ఞాపకాన్ని బట్టి పోగుచేసినదిమాదట. పై సంభాషణ 1931 లో రాయబడింది. విశేష సారస్వత జ్ఞానంతో పాటు సరళమైన సరస్వతీ జ్ఞానం కూడా కలిగి సుప్రసిద్ధులైన ఒకానొక కాలేజీ ప్రిన్సిపాల్ గారు తనని గురించీ తన సహోధ్యాయుల్ని గురించీ తన విద్యార్థుల్లో కొందరు ఏకాంతంలో ఏమనుకుంటారంటూనో ఎప్పుడో తెలుసుకుని, ఇది విన్న విద్యార్థులకి కొంచెం గిలిగిలిగానూ సహోధ్యాపకులకి కొంచెం హెచ్చరికగానూ ఉండేలాగున, ఆమాటలు తనే విద్యార్థులందరికీ పబ్లికుగా క్లాసులో చెప్పిఉండడం నాకు తెలుసు. ఆయన చేసిఉన్న అప్పటి ప్రసంగం గురించిన జ్ఞాపకమే ఈ సంభాషణకి మూలం.

అయితే, ఇది ఆర్ట్సు కాలేజీలో పూర్వవిద్యార్థి సంఘం కాలూరు ఉత్సవసభలో 24-1-81 నాడు నేను చదివేటప్పుడు కొంచెం దుమారం రేగింది. ఆరోజు కార్యక్రమంలో నారచన చదవడానికి నన్ను అసలు ఆలస్యంగా పిలిచారు. కడంది కొంత గబగబా అనేసి కొంతసేపటికి ఈ ఘట్టంలోకి వచ్చాను. అప్పటి ప్రిన్సిపాల్ గారు శ్రీ శ్రీ చక్రవర్తిగారు.

ఇంకొక్క పదిపన్నెండు వాక్యాలు నేను చదవగానే, మరి ఆపుచేయించవలసిందని వారెళ్ళి అధ్యక్షులైన శ్రీశ్రీ గంటి జిన్మన్న గారిని కోరారు. ఆయన, వెంటనే ఏ ఆజ్ఞా ఇయ్యలేదు. ప్రిన్సిపల్ కి ఎందుకో ఏదో కోపం వచ్చి ఆపేయించమంటున్నారని జనమంతా అనుకున్నారు. జనంతో పాటు నేనూ అనుకున్నాను. ప్రిన్సిపల్ గురించి ఉన్నదిగా రెండు వాక్యాలు సంభాషణకి మొదట్లోనే రావడం ఆగడానికి కారణమేమో అని నాకూ అనిపించింది. దానికి తగ్గట్టే అప్పుడు సభలో ఇద్దరు ప్రిన్సిపల్స్ ఉన్నారు, సరే, రెండు ఉపమానాలూ చెరొకటి సరిపడేలాగ నేను అప్పటి కప్పుడు తెచ్చానని అంతా అనుకుంటూ ఉన్నట్టు కనిపించింది. అందువల్లే శ్రీశ్రీ చక్రవర్తిగారు కోపంలో పడిపోయి సభ ఆపించేయాలని పట్టుపడుతున్నారని సభ్యులు సంకల్పపడ్డారా అన్నట్టుగా, జనం అంతా వారికేసి చూడడం, ఈ సంభాషణ చదివే నిమిత్తం నాకు ఇంకా టైం ఇప్పించవలసిందని అధ్యక్షుల్ని అడగడం. 'గో ఆన్ ప్లీజ్' అని నాతో కేక పెట్టడం సాగించాడు. నేను సమస్యలో పడ్డాను. అధ్యక్షులు నాకు కొంత వ్యవధి ఇస్తూ, త్వరగా ముగించమని ఆజ్ఞ ఇచ్చారు. నేనూ ఆ వ్యవధి ఉపయోగించుకోవాలని తొందరపడుతూండగా, ప్రిన్సిపాలుగారు అధ్యక్షులదగ్గిరికి వెళ్ళి మళ్ళీ ఫిర్యాదు చేశారు. ఆ ఫిర్యాదు నామీదే అయి ఉంటుందని అందరికీ తెలిసింది. దాంతో అధ్యక్షులు నన్ను ఆగిపొమ్మన్నారు. నేను తక్షణం అధ్యక్షులమాట శిరసావహించి సభవారికి నమస్కరించి వేదిక దిగి ఎదరికి నిష్క్రమించబోతూ, వెనకాల ఉన్న శాస్త్రప్రయోగశాలలో నేను విడిచి వచ్చిన చెప్పులమాట జ్ఞాపకంవచ్చి వెనక్కి వెళ్ళబోతూంటే, శ్రీశ్రీ చక్రవర్తిగారు, "వీడు మళ్ళీ ఏదో ఇంకా చదవడానికే వస్తున్నాడు గావును" అనుకున్నారు గావును, వెనక్కి రావద్దు అన్నట్టు చెయి విదిల్చి నాకు సంజ్ఞచేశారు. ఆయన చెయ్యి విసురు అంతా కూడా గమనించారు. ఆయనదగ్గిర నేను చదువుకునేటంత భాగ్యంతో పుట్టకపోయినా వారిని

'నీ కెవరండీ సన్మానడానికి' అంటూ దీర్ఘాక, వారి పెద్దతనమన్నించి దిగి పోయాను. దాంతో ఆసభ హఠాత్తుగా ఆగిపోయింది.

అసలు సంగతి తరవాత తెలిసింది! ఎప్పుడూ అంతే! ఆయనకి కోపమూ కాదుట, మరోటీ కాదుట! అసలు ఆయనకి అప్పట్లో నేను చదివిన తెలుగుముక్కలు చిన్నగా అర్థమే కాలేదుట! ఆయన ఆలోచన సరిగ్గా ఎనిమిదిగంటలకి ఖరీదైన విందు ఒకటి స్వంతఖర్చుమీద ఏర్పాటు చేసి, కలకటేర్లలాంటి అసలైన జనాన్ని ఆహ్వానించారట. అట్లా పిలవబడ్డ అత్యాదర వర్గాలజనమూ—ప్రస్తుత విషయం భోజనం గనక—ఒక నిమిషైనా దాటకుండా వచ్చి కూచుని తరవాత హాలాడిపోతారేమో, వారిని తపింపచెయ్యడం భావ్యమా అనిట, ఆయన పెంగ యాతనస్యం! అంతేట! అల్లా అయితే ఆమాట కాస్తా అధ్యక్షుల చేత సభ వారిచెవిని వేయించినా తీరిపోను! అల్లా చేశారు కారు. సమయానికి సంగతులు పోతాయిగాని తోస్తాయా!

అందుకు ఫలితం లేకపోలేదు, నారచన ప్రమాదకరంగా ఉండే బాపతేమోనని కాలేజీఅధికారులు శంకించుతూండడం, సభలో పఠించడానికి పూర్వం నేను అది తమచేత దాఖలు చెయ్యవలసి ఉంటుందని నాతో చెప్పడం జరిగింది. అల్లా అడిగినంత కాలం, నేను అక్కడ కనిపించడం మాని, కాలేజీకి వస్తే రాగల అప్రతిష్ఠ తొలగించేశాను? మరి కొంతకాలానికి నారచనమీద ఆంక్ష తీసెయ్యడంఅయింది! ఇప్పుడేమీ లేదు ఇదీ కథ ]

మాటపఠన (3)—1933

అట్లుకారేపిరో

21—1—1933 తారీఖున

పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో

డాక్టర్ సర్. యస్.

రాధా కృష్ణన్ గారి

అధ్యక్షత క్రింద జరి

గిన సభలో చదివినది.

## పాలక సంఘాల్లో ఎన్నికల మజా

కొందర్ని మరికొందరు పాలించడం అవసరం అదివరకే వస్తూనే వుంది. ఎవరైనా కన్య పూర్వం "యావజ్జీవితం నన్ను పాలించవయ్యా" అని తనకి నచ్చిన నాథుణ్ణి స్వయంగా వరించేది. కొంత కాలం పాటు కన్య తరపున కన్య తండ్రి బయల్దేరి కన్యకి నాథుణ్ణి వరించి పెళ్ళితో చ్చాడు. ఇటీవల మళ్ళీ కన్య తన వరుణ్ణి స్వయంగానే ఎన్నుకుంటూంది. అల్లాగే అదివి ప్రజలు తమర్ని శాస్త్రంగా పాలించిపెట్టడానికి నాథుణ్ణి తమరే ఏరి తీసుకునేవారు. కాలక్రమాన్ని, ప్రజల్ని పాలించడానికి [illegible] దేవుడు వాక్కిచ్చాడు, ఇంకొకడు ఎవడైనా తనకీ అల్లాంటి వాక్కుందని చెలరేగితే వాణ్ణి పాతేయ్యగలం అని చెబుతూ కొందరు బలశాలులు బయలుదేరుతోచ్చారు. ఇటీవల మళ్ళీ ప్రజలే

తమ పాలకుల్ని ఎన్నుకోవడం ప్రారంభించారు. పూర్వకాలపు వివాహ సంబంధమైన స్వయంవరం పోటీల్లో నెగ్గడానికి ఎవరికేనా ప్రజ్ఞ, బుద్ధి, బలం, ధనం, వగైరాలు అవసరంగా ఉండేవి. ఇప్పటి పరిపాలనతో సంబంధించిన ఎన్నికల పోటీల్లో నెగ్గడానికి ఎవరికేనా, సంగోరు ధనం సంగోరు నక్క జిత్తులూ ఉండాలి. లేక ఒక నేళ ధనహీనుడైనా పరిపూర్ణమైన నక్క జిత్తు లుండి, ఇతరోడి చేత ధనం పెట్టుబడి పెట్టించినా చాలు, చక్కటి 'ఛాన్సు' ఉంటుంది. వెనుకటి స్వయంవరాల్లో, పేరు పడ్డవారు, చాలా వేషం వేసుకుని, శృంగార చేష్టలు చేస్తూ, సిగ్గుపడుతూ కూర్చునే వారననీ, అప్పుడు "బాల రావే, పోల సిభూ" లాంటి పాటలో కన్యయొక్క చెలికత్తె ఆయా మహానుభావుల గుణగణాదికం వర్ణించేదనిన్నీ, పూల దండకోసం అంతముందు అట్టుంచు చాచుకుని ఉన్నా, కన్య తనకి నచ్చిన వాడికే వేసేదనిన్నీ, తరవాత, అవసరం చొప్పున, వాడు, తక్కినవాళ్ళని తన్నేవాడనిన్నీ, చదువుతాం. నేటి నవనాగరికతతో నిండిన ఎన్నికల్లో పేరు లేని వారైనా, చాలా వేషం వేసుకుని, భీభత్సపు పనులు చేస్తూ, సిగ్గుపడుతూనేనా కూర్చోక, తను ఆస్తి తినేసే తమ ఏజంట్లు తమకి అన్యాయం చేస్తారేమో అనే భీతి చొప్పున తమరే ఊరేగుతూ తమ ప్రభావాదికం పీళ్లే కొచ్చిందని చెప్పి వర్ణించుకుంటూ, తమకు నచ్చిన మాదట తమకి దక్కవలసిన తమరే విజయం పుష్పమాలని

అక్రమంగా ఊడలాగి, తెంపేసి తెచ్చుకొని, మెడకి చుట్టుకుని, అది సక్రమంగానే తమకి సంక్రమించినట్లు నటించుతూండడం, చూస్తున్నాం. మానవసేవ చేసి, ఆత్మార్పణంచేసి తరించడానికి మాకు ఎక్కడా జాగా కనిపించక పోవడంచేతనే, మేం పాలక సంఘాల్లోకి జొరపడ్డాం అని చాలామంది పైకి ప్రకటించినా, చేతైతే అధికారం-వీలైతే ధనం-వద్దన్నా నమస్కారాలు వగైరా, అతిస్వల్పకాలంలో సంపాదించవచ్చుగదా అనే ఉద్దేశం చాలామందికి లోపల ఉండడంవల్లే సంఘసభ్యత్వాలకి అంతంతపోటీ బయల్దేరడం. పల్లెలకి కూడా పాలకసంఘాలున్నాయి. అందుకని ఉపగ్రామ, గ్రామ, పట్టణ, తాలూకా, జిల్లా, రాష్ట్ర, దేశ-పాలక సంఘాలు ఏర్పడేటందుకుగాను ఎన్నికలు జరుగుతూంటాయి. ఎన్నికలు నాగరికత వెల్లడించే కోడిపందాలు. ఎన్నికల రోజుల్లో విస్తారంగా "కారు" కూతలు వినిపిస్తూంటాయి. ఎన్నికల్లో ద్రవ్యం అపవిత్రంగా ప్రవహిస్తూండడం వల్ల "ద్రవ్య" పదం ఏకకాలమందే వ్యర్థం సార్థకంకూడా అవుతుంది. ఉపాయాలు నాలుగే అనే మాట కేవలం తప్పనిన్నీ, శతకోటి దరిద్రాలు లేకుండానే యితర అవసరాల్ని బట్టి అనంతకోటి వుపాయాలు మానవులకి తట్టుతా యనిన్నీ ఎన్నికలలో రుజువు దొరుకుతుంది. ఎన్నిక నిఘంటువుల్లో, అసత్యం, అధర్మం, అన్యాయం, ద్రోహం, క్రౌర్యం దారుణం లాంటి మాటలుండవు. ఒకడు, తాను ఏం జెయ్యా

డానికి వెళుతున్నాడో తెలియకుండానే పెట్టుబడి పెట్టవలసిన అగత్యం ఉండేది ఒక్క ఎన్నికల వ్యాపారంలోనే. ఒకడు పాడు పన్లు చేస్తున్నాడంటే, మనం కూడా, నెగ్గాలంటే, అంత కంటె పాడుపన్లు చెయ్యవలసి వచ్చేది ఎన్నికల్లోనే. ఎంత పైపైకి ఎగరాలంటే, అంత లోపల లోపల గోతులు తవ్వవలసొచ్చేది ఎన్నికల్లోనే. ముక్కుకి సూటిగా వెళ్ళకూడనిది ఎన్నికల్లోనే. అర్హత అనేమాటేవా స్మరించవలసిన చిక్కు లేకుండా చాలామంది జుట్లు నా చేతులోకి వస్తాయి గదా అని చివరకి నిందు సున్నా రావైనా సరే మురియడానికి వీలుండేది ఎన్నికల్లోనే. ఎన్నికల్లో నెగ్గడమనేదే పరమావధి. "వాడెల్లా నెగ్గాడ్రా, వీడెల్లా జయించాడ్రా" అని ఆశ్చర్యపడేవాడు పూర్వకాలపు ఘటం. ఎన్నికల్లో నెగ్గిన వాడి ఊసూ, వాడి పరివారం యొక్క ఊహా కూడా ఏమిటంటే, "ఇక చాలు. మనం కోటలో పాగా వేశాం అన్నమాటే" అని. నెగ్గేసరికే ఎవరికేనా అన్ని విధాలా అస్తమయం అవుతోంది గనక, ఆ తరువాత చేసేపని కనిపించదు, కనిపించినా కరచరణాలు ఆడడానికి సత్తువ ఉండదు. ఎన్నికల్లో విజయం పొందిన వాళ్ళకి సాధారణంగా స్థితి పాడై పోతుంది. అపజయం పొందిన వాళ్ళకి స్థితితో పాటు మతి కూడా పాడై పోతుంది.

ఒకచోట, ఆశ్రయింపులు, బెల్లింపులు, ప్రార్థనలు, తిళ్ళు తిప్పలు తిరుగుళ్ళు, మారాముళ్ళు, దగాలు, బెదిరిం

ప్రులు, కొట్లుగోడాలు, అరెస్టులు, వారంట్లు చార్జీలు, వగైరా లతో పాలకసంఘసభ్యుల ఎన్నికలు అనే "ఎలెక్షన్" జాతర జరిగింది. పాలకసంఘంలోకి మొత్తం ౧౮-గురు ఆసాములు గెల్చి పడ్డారు. వీరిలో చాలా రకాల జనం ఉన్నారు. కాని, భీమయ్యా నారయ్యలనే ఇద్దరు పండేసిపప్పలు బయల్దేరి చెరోపార్టీ లేవదీశారు. ఎందుకూ? అధ్యక్షుణ్ణి ఎన్నుకోడానికి. ఇక ఎన్నికదినం మూడురోజు లుండనగా, భీమయ్యా పార్టీలో ౧౧ గురు, నారయ్యా పార్టీలో ౭-గురు ఉన్నారు. విజయం భీమయ్యకి తప్ప దనుకున్నారు. అప్పుడే మహా, భీమయ్యా గర్వించిపోయి, అతి నమ్రతతో, అధ్యక్షుడి పార్టు ఎట్లా అభినయించాలో "రిహార్సలు" వేసుకుంటూ, బ్యాండువాళ్ళకీ తాషావాళ్ళకీ బజానాలు పారేసి టీవగైరా పార్టీలకి ఖంజాయించాడు. అయితే భీమయ్యా పార్టీలో ఒక అతడు చిన్నతనంనించీ తాగుడుతో ఏక తీసుగుని, బాధపడే వాడున్నాడు. అతని పేరు తుమ్మయ్యా. ఆ బాధతో సాయంత్రవేళప్పుడు అతడు మందు వేసుగోడానికి ఆ గుడాసుపత్రికి వెడుతూంటే, నారయ్యా తాలూకుజనం అతణ్ణి పసికట్టి, అతడి అవస్థకి జాలిపడి, అతణ్ణి కారుమీద ఎక్కించుగుని లేవదీసుకుపోయారు. ఒక పార్టీ పురుషుణ్ణి రెండోపార్టీవారు లేవదీసుకుపోవడం ఏలెక్షన్ నాటకంలో రాక్షసశృంగారం. లేవదీసుకుపోయి, అతనికున్న నూరురూపాయల బాకీ తీర్చడమే కాకుండా అతణ్ణి సారాభ్యంగనం చేయించి, అతగానికి పీపానివాసం

ఏర్పాటు చేశారు. దాంతో, అతనికి బాహ్యాంతర్గాల్లో ఆ అమృత స్పర్శ కలిగేసరికి అతడు ఆ అపస్మారక స్థితి లోనే నారయ్యనుతన్నుకుపోయాడు. ఉపాధ్యక్షుణ్ణి చేస్తాం అని ఆశపెట్టి ఒక సోమయ్యనీ, మరో మరో ఆశపెట్టి ఒకకోసయ్యనీ కూడా నారయ్యపక్షానికి తిప్పేశారు. మనసారా ఏపార్టీకీ చెందక ఊగిసలాడే అనామకులు, తూకానికి పనికొస్తారు గనక, వాళ్ళ రేటు తూకానికి రూపాయి చొప్పున పెరిగిపో తోంది: ఆ ఊగిసలాడేవారు నామకులైతే అసలు కే ఉద్వాసన చెప్పేవారు కావచ్చు గనక, వాళ్ళు ఉభయభ్రష్టులవుతారు. అక్కడితో నారయ్య పార్టీ ౧౦ అయింది, భీమయ్యది ౮ అయింది. ఇక అమర్నాథు అధ్యక్షుడి ఎన్నిక. నారయ్య తన నూరుగురు జనాన్ని ఖైదీలను పట్టినట్టు పట్టి ఓ మేడలో చేర్చాడు. వాళ్లు అక్కడే పిండివంటల్తో దిట్టంగా భోజనం కానిచ్చారు. రాత్రి౧౦గంటలవేళప్పుడుఒకతను—తుమ్మయ్యో గావును—బాహ్యానికి వెడతానన్నాడు నారయ్య ముందు తనే దొడ్లో కెళ్ళి, దానికి ఇతరదార్లు ఏవీ లేవని ముందు తణికీ చేసి చూసి, గోడబారుడటిణ్ణి కాపలా కూచోబెట్టి, వాడు మళ్ళీ అవతలకిపోతాడేమో అని వాణ్ణి గొలుసుతో తాళం వేసి, అప్పుడు తుమ్మయ్యని పంపి, తను ఇవతల కాపలా ఉండి, అతడు వచ్చింతరవాత, వాళ్ళిద్దర్నీ మళ్ళీ మేడెక్కించాడు. అంతా పడుకున్నారుగాని, నారయ్యకి కునుకు లేదు. రాత్రి౧౨ గంటలకి సోమయ్యకి ఓ టెలిగ్రాం ఉందంటూ ఒకబంట్రోతు

వచ్చి తల్పు కొట్టాడు. కాని నారయ్య, సంగతి ఊహించుకుని తలుపు తియ్యకుండానే. 'సోమయ్య ఇక్కడ లేడు' అని కేకేశాడు. 'పోనీ మీరు పుచ్చుకోండి' అని భద్రోతు కేకేశాడు. 'నేను నిద్దరోతున్నాను ప్రస్తుతం' అని నారయ్య అనేసి ఊరుకున్నాడు. నారయ్యపార్టీ వారంతా కూడా రామా యణాలు నెత్తిమీద పెట్టుకుని, ఒకరికొకరు ద్రోహం చెయ్యకూడదనిన్నీ, కలిసి ఉండాలనిన్నీ ప్రమాణాలు చేసు కున్నారు. రామాయణాలు పెట్టుకున్న కారణం ఏమిటంటే, వారు పురాణాలు ఎంత పాటిస్తారో ప్రమాణాలుకూడా అంతే పాటించాలనే ఊహ ఉందని చెప్పడానికి! తెల్లా రింది. వారు కాఫ్యాములు అక్కడే పుచ్చుకుని. భోజనం అక్కడే చేశారు. మధ్యాహ్నం, ౧-౨ గంటలకి కచేరీకి వీళ్లు వెళ్ళాలి—ఒక మూరుమూలదారంట. ౨ మైళ్లు వెళ్ళాలి. పదకొండుగంటలకే రొండు కార్లు తెచ్చారు—నాలు గుపక్కలా గాలిచొరకుండా గంతలుకట్టి. కాని ఈలోపల తెలిసిన సంగతినిబట్టి బయల్దేరడానికి జంకారు. ఏమిటాసంగతి? మధ్య దారిలో భీమయ్యపార్టీజనం కాసి, నారయ్యకార్లని కార్లల్లో జనాన్ని మొత్తంగా గుండకింద కొట్టేస్తారనిన్నీ. అధికా రుల్లో బంధువులుండడ వల్ల వాళ్లు నిర్భయంగా ఉన్నారనిన్నీ! మచ్చుచూద్దాం అని చెప్పి, నారయ్య స్నేహితుడు ఒకాయన బయల్దేరి ముందు కార్లో వెళ్లాడు. వెళ్లేసరికి, భీమయ్యజనం కర్రా కంపా పుచ్చుకుని ఈ కారుమీద పడ్డారు—మొ బర్ల

కారేమో అనుకుని. డ్రైవరు తొందరపడడంచేత కారు టక్కిం చిట్టా మేడీతో దాటింది. రంగన్నకి ఇంతలో స్నేహితుడూ అల్లా నేకారుమీద వస్తూంటే అటెన్షన్ బటిక్ బాజా చేస్తూ, "ఈదాన్ని కారెల్లా విమానంలాగ కొంపాన్యాగా!" అన్నారట. అంటే అతను వెనక్కి మళ్ళిపోయి, ఒక గట్టి ఉద్యోగస్తుణ్ణి ఒక కారులో కూచోపెట్టి ఆదాన్ని పంపించాము. భీమయ్య జనం ఆగార్ని పెట్టగానే అతను కారు దిగి, ఉద్యోగపు కర్రలూ పనిముట్లూ చూసేసరికి, భీమయ్య జనం చెల్లాచెదరై పోయారు. అప్పుడు ఆ ఉద్యోగికి వెనక్కి వెళ్ళి, దగ్గరుండి. నారయ్య మెంబర్ల కాళ్లు బయట చేరదీయించాము. పాపం, మెంబర్లంతా అందులో కూచున్నారు, ఘోషాస్త్రీలలాగ, చిన్న చిన్న సందులు చేసుకుని ప్రపంచంలో జనాన్ని చూస్తూనూ! బైముకీముందే కాళ్లు కచేరీలో ఆగాయి—జంతువులుండే సర్కస్ బళ్లు మైదానం మీద ఆగేరీతిగా! నారయ్య తన జనాన్ని దక్కులు చూడనియ్యకుండా (చూడనిస్తే, ఏ మెంబరేనా అవతలపార్టీసి ఎక్కడ మోహించి ఏక్షణంలో లేచిపోతాడో అని) లోపలికి నడిపించుకు వెళ్ళి, కూచోమని, వోట్లు వేయించాడు. సోమయ్యమాత్రం నారయ్య నెగ్గడం సంగతి ఊహించగా అసంతోషం పట్టజాలక, "నా వోటు నారయ్యకే!" అని పేరుచెప్పి కేకేశాడు. దాంతోటి అది రహస్యం కాకపోవడంవల్ల అతని ఓటు కందిపప్పు కాటాయి నట్టయి మూలబడిపోయింది. అయినా సరే, ఒక్క ఓటు

ఎక్కువ వత్తో, నారయ్య అధ్యక్షపదవి లాగేశాడు. భీమయ్య ఆత్మహత్య చేసుకుందాం అని సంకల్పించుకోక పూర్వమే అతని జాతకం బాగుండచ్చునని ఎవరో జ్యోతిష్యం చెప్పగా ఆగిపోయాడు.

సోమయ్య ఓటు నపుంసకం కావడంచేత, అతను నారయ్యకి చేసిన సాయం లేకపోవడంచేత అతనికి ఉపాధ్యక్షపదవి దొరకలేదు. అతనికి మొహం జేవురించింది. బుట్టలో పడిపోయాడు గాని నారయ్యపార్టీ అంటే అతనికి ఇష్టం లేదు, అసలు వైరంకూడాను. ఇంతలో మరోటి జరిగింది. ఈ సంఘం తరఫున ఉన్న ఒకబళ్ళో ఒక మేష్టరీ ఖాళీ వచ్చింది. ధాన్యం చవకైన తరవాత మేష్టరీ ప్రియమైంది. సోమయ్య మేనమామ కొడుకొకడు ఎసెల్సీలై, ట్రైనింగై, కడంవి అన్నీ కూడా అయి, మేష్టరీపోస్టు నిరీక్షిస్తున్నాడు— లకుముకి పిట్ట చేపకోసంలాగ! అతగానికి ఆ కాస్త పోస్టూ పారెయ్యవలిసిందని సోమయ్య నారయ్యని లోపాయికారీగా కోరాడు. శాస్త్రం చెప్పినట్టయింది, నారయ్యకీ మేనమామ లున్నారు. వాళ్ళకి అమాంబాపతూ ఆరుగురు కొడుకు లున్నారు, మేష్టరీ చెయ్యడానికి తలపాగా చుట్టుగుని సిద్ధంగా కూచున్నవాళ్ళు! వాళ్ళలో ఎవరికి, ఆపోస్టు ఇస్తే, కడంవాళ్ళకి ఏం కోపాలొస్తాయో అని ఎటూ పాలుపోకుండా ఇదవుతున్నానని నారయ్య సోమయ్యతో చెప్తూగున్నాడు. సోమయ్య, "సరేలే, కానీ" అని నార

య్యతో అని, అతణ్ణి విసర్జించి, ఆబట్టల్లోనే వెళ్ళి భీమయ్య పార్టీలో జేరి, అతని కార్లో షికారు వెళ్ళాడు. నిప్పులు గక్కుతూన్న భీమయ్యకళ్ళకి కాస్త చల్లగాలి సోకింది. ఇక వ్యవహారం తిరగదోడడానికి అతను ఎత్తులు వన్నాడు. ఆ సాయంత్రమే నారయ్యపక్షంలో మరొకడైన తమ్మయ్య పనుండి కల్లుకు గానానికి వెడుతున్నాడు. ఈసంగతి భీమయ్యకి తెలిసి అతను తన జట్టుతో వెళ్ళి, కారు ఆపకుండానే అతణ్ణి కారులోకి ఈడ్చుకుని, చక్కాపోయాడు. అప్పట్లో అతని ఆనందం, ఠీవి, ఆ సీనుమాత్రం పోల్చాలంటే, సాక్షాత్తూ ఆ రుక్మిణీదేవిని రథంమీద వస్తూనే తీసుకెళ్ళిన శ్రీకృష్ణుడు జ్ఞాపకంవస్తాడు. ఆఫళంగా తమ్మయ్యకి పెద్ద బోయిలరు లాంటి పీపాకొనడం అయింది. దుకాణం దగ్గర్నించి తనయింటికి ఒక పైపు పెట్టించవలసిందని అతను వరం కోరుకున్నాడు. సరేనని అతణ్ణి గ్రామాంతరం లాక్కుపోయి భీమయ్య బంధువులింట, అతణ్ణి అజ్ఞాతవాసంలో ఉంచేశారు. ఇక్కడికి నారయ్యపక్షంలోంచి ఇద్దరు పరపక్షం అయిపోయారు. నారయ్య పార్టీలోనే మరోసభ్యుడికి ఋణాలవల్ల దివాలా స్థితిలాంటిది వచ్చి మతి పోయేటంతపని జరిగింది. దివాలా తీసినా పిచ్చెత్తినా సభ్యత్వంపోతుంది. సభ్యుడు కావడానికి ఎవరేనా బతకగలిగి మతిగలిగి ఉండద్దూ మరి! ఆసమయంలో, భీమయ్య వెళ్ళి, ఆ మెంబరుయొక్క ఋణదాతలచేత ఆమెంబరికి ఉత్తరాలు రాయించాడు—ఏమనీ? "డబ్బేనా కక్కు!

లేదా, భీమయ్యపక్షమేనా చేరు'' అని. దాంతోటి ఆమెంబరు భీమయ్యలో కలిశాడు. మరొక మెంబరుకి ''నువ్వు భీమయ్య పార్టీలో చేరకపోతే నీకూతుర్ని వొదిలిపెడుతున్నా''నని ఆతని అల్లుడు చేత ఉత్తరం కొట్టించారు. ఆమెంబరు ''విడాకులచట్టం వచ్చి పడుతోంది. ఇక అల్లుడంటే నాకు భయమేమిటీ!'' అనుకున్నాడు గావును, ఆ బెదరింపులికి జడవలేదు. తరవాత అతణ్ణి తన్నుతాం అని అతనికి శుభలేఖ రాశారు. అతగాడు కొయ్యయి, ఎందునా బొందక తటస్థుడై పోయాడు. అక్కడితోటి భీమయ్య బలం ౧౧, నారయ్యది ౬ అయింది.

వెంటనే, భీమయ్య కత్తులూ కటార్లూ నూరి, అధ్యక్షుడైన నారయ్యమీద విశ్వాస రాహిత్య తీర్మానం పెట్టించి నెగ్గడానికి మీటింగు పెట్టించమని నారయ్యని కోరాడు. నారయ్య, మరోఆకు ఎక్కువ చదివిఉన్నవాడవడంచేత అందుకు ఒప్పుగుని ఆ పదోనాడు సంఘసమావేశం అన్నాడు. అధ్యక్ష పదవిలో ఉండి నిరంకుశత్వం చెలాయించకుండా చెయ్యడానికి, విశ్వాస రాహిత్య తీర్మానం పుట్టింది. అక్కణ్ణించి, ఎవరు అధ్యక్షుడైనా, తక్కిన వాళ్ళకి అతనిమీద విశ్వాసం లేకపోవడం మామూలైంది. పరవిశ్వాసంమాటలా! ఆత్మవిశ్వాసం మాత్రం ఎంత కష్టం! ముందు ఆత్మ ఉండాలి, తరవాత విశ్వాసం ఉండాలి. ఆ మీటింగులోకి భీమయ్య సపరివారసమేతంగా వెళ్ళి కూచున్నాడు. విశ్వాస

రాహిత్య తీర్మానానికి అనుకూలంగా ౧౧ గురు, ప్రతికూలంగా ౭ గురు అయ్యారు. నారయ్యకి అధ్యక్షపదవి ఊడిపోడానికి ఆ తేడా చాలనుగాని తాత్కాలికంగా అతనికే అవజయం. ఆ సంగతి సమావేశ చర్యాసంగ్రహ పుస్తకంలో రాయవలసిందని నారయ్యగార్ని కోరారు. అతడు ' అనుకూలురు ౧౧-గురు ప్రతికూలురు ౭-గురు, సంగతి పైవారికి తెలుపబడును, అనే రాశాడుగాని, ' సదరు తీర్మానం నెగ్గింది' అని మాత్రం అందులో రాయలేదు. భీమయ్యగారి పార్టీ వారు, ఆ రాసింది పైకిచదివి వినపించమన్నారు. నారయ్య అట్లాంటిది అవసరం లేదని చెబుతూ, నవ్వుతూ, చల్లగా, ఆ పుస్తకం దాచేసి, మెల్లిగా బైటికి దారితీశాడు. అతడు వెళ్ళి సోమయ్యని కలుసుకుని, " రామాయణం నెత్తిమీద పెట్టుగుని ప్రమాణంచేసి, తిరిగిపోవచ్చా ? " అని అడిగించాడు. అందుకు సోమయ్య, " మీరంతా నా చేతులోది రామాయణం అనుకున్నారు గావును, పాపం! అది అంతేసై జులో కుట్టించిన తెల్లకాగితాల బైండు బుక్కు! ఎక్కడో, తెలియకుండా మాట్లాడుతారేం ! " అన్నాడు. నారయ్య తనపార్టీసంఖ్య గురించి మరి చూడక మరోవుంత తొక్కాడు. భీమయ్య అవుంతా కాశాడు. పదవీలాక్కోవాలని ఒకరూ, ఉంచుకోవాలని ఒకరూ రతుస చాణక్యుల్లాగ ఎత్తుపై ఎత్తులు వేస్తూనే ఉంటారు. పాలకసంఘం పాలించవలసిన మేరలో ఉన్న జనంసంగతి ఎవరికీ అక్కర్లేదు. జనం పంపిన

మీదట పాలకసంఘంలోకి వెళ్ళి, వెంటనే ఆజనాన్ని మరిచి పోడమే ఎన్నికల్లో మజా; ఒకవేళ జ్ఞాపకం ఉంచుగున్నా, ఆ జనుల్లో మొదటి జనుడు తనేగదా అనుకోడం మరీమజా!!

సంగతులు

1. ఒక కుర్రాడు సకలంగడ్డీకరించి బస్తీలో బంధువులింటో ఉండి ఇంగ్లీషులు చెప్పుకున్నాడు. పనివుట్టక పబ్లికు సర్వీసు పరిక్షకి వెళ్ళాడు. ఆ పరిక్షలో ప్రశ్నలు బి. యే., యం. యే, జడ్. యే., వాళ్ళకుడా పట్టికొట్టేటట్టున్నా, ఎవరేనాసరే ప్యాసయ్యేటట్టున్నా, కావలసిన వాళ్ళని పైకిలాగడానికి వీలుగానున్నా ఉంటాయి. ఆకుర్రాడు అందులో తేలాడు కాని పనిదొరకలేదు. అయినా ఆ బంధువులింటోనే ఉంటూ ఊళ్ళో కచ్చేరీలలోకి వెళ్ళి 'వాలంట్రీ' చేసివస్తూండేవాడు. ఎక్కడపడితే అక్కడ ఆ అబ్బాయి తనసంగతి చెప్పుకోడంలో —ఆ బంధువులు చాలా మంచివారనీ, తనకి భోజనం మస్తుగా పెడతారనిన్నీ అని వాళ్ళని మెచ్చుగుంటూండేవాడు. ఒకనాడు ఇంకంటాక్సు కచేరీలోకివెళ్ళి ఇల్లా చెప్పాడు. తక్షణం ఆ బంధువుకి 150 రూపాయలు ఇంకంటాక్సు అంటుగుంది. మంటేసుగొచ్చి ఆయన ఆ కుర్రాణ్ణి ఇంటోంచి గెంటేశాడు.

2. అచ్చువెయ్యడానికి వీలుగా ఉండే తెల్లకాగితం పరాయి దేశాల్నుంచి వస్తుంది. ఆ కాగితంమీద పన్ను

హెచ్చింది. ఇటువంటప్పుడు స్వదేశీ పేపరు మిల్లులు ఆడితే-నయమే. మన పేపరు మిల్లుకి ఇంకా ఆటా లేదు పాటా లేదు. పాపం! కాని, మొన్న పుష్కర ప్రదర్శనాల్లో కించిత్తు డబ్బు ఆర్జించింది. ఆడబ్బు పేపరువల్లనే చేసిఉంటే జనం ఇంకా సంతోషించి ఉందురు.

3. భూములమీద పన్నులు పైకిపోయి, ధాన్యపు ధర్లు కిందికి పోవడం గురించి మాట్లాడుతూ ఒక తెలుగు లెక్కల మేష్టరు, "దీన్నే, విలోమ నిష్పత్తి అంటారు." అన్నాడు. వారి స్నేహితుడు ఒకాయన, "ధాన్యప్రసంగంలో పత్తి లేక పోవడమున్నూ, పైగా లోమంకూడా ఏమిటయ్యా!" అని కోపించాడు. అప్పుడాయన, "అనగా ఇన్వర్స్ రేషియో అండీ" అని విడమరిచి స్నేహితుడుతో చెప్పాడు. అప్పుడు ఆ స్నేహితుడు, "అదా! అట్లాయితే, పాఠాలన్నీకూడా తెలిసేటట్టు ఇంగ్లీషులోనే చెబితే నయం" అన్నాడు.

4. ప్రపంచంఅంతా చదువుకోని వాళ్ళనిరుద్యోగసమస్యతో తటాలుపడుతూంటే, మన దేశం ఇంగ్లీషు చదివినవాళ్ల నిరుద్యోగంతో మూలుగుతోంది. చీనాలో కాలేజీలు వగైరాలు ముప్పైయేళ్లదాకా మూసేశారట. మన దేశంలో ఎందుకు మూసెయ్యరో ఇంకా! మేష్టరు పండితుల్ని ఎంజెయ్యాలో తెలియక గావును! ఇంగ్లీషు చదివిన నిరుద్యోగుల్ని పల్లెటూళ్ల మీద పడమని అంతా సలహాయిస్తూంటే ఆత్మగౌరవం పోతుందని చాలామంది ఆపని చెయ్యలేకుండా ఉన్నారు. ఈమధ్య

అలాంటివారు ఓ పదిమందికలిసి ఓ సంఘం ఏర్పరిచారు. వాళ్లు సంచారం బయల్దేరి కొందరు కొందర్ని సాష్టాంగ పెట్టు కున్నారు ఎవర్ని అంటే, ఎలక్షన్ పోటీల్లో వోడిపోయిన వాళ్ళనీ, తప్పుమీరించి దిగిపోయిన అధ్యక్షుల్నీ, వగైరాలనీ. ఎందుచేతంటే వాళ్ళని ప్రస్తుతస్థితిలో చూసేవాళ్ళూ ఆశ్రయిం చేవాళ్ళూ ఎవళ్ళూ ఉండకపోవడంవల్ల, గుడ్డిలేకుండా చూస్తా రనిన్నీ చెముడులేకుండా వింటారనిన్నీ, సావకాశంగా మాట్లా డతారనిన్నీ. ఈరీతిగా ఆ పదిమంది నిరుద్యోగులకీ అన్నం పెడుతోందని వినికిడి — వెళ్ళిపోడం అంటే పొట్టగడిచిపోడం అన్నమాట. మరేం కాదు.

5. యల్. టి. అనే మేష్టరీ పరీక్ష పేరుపోయి, బి. యి. డి. అని ‥ వడానికి కారణం! బి. యి. డి. అనగా ఇంగ్లీషులో, పడుకునే పక్క గదా, బియిడీలు ఉద్యోగాలులేక మంచం పట్టాలనేముందుచూపుతో పైవారు పాతపేరు మార్చి ఈ నామకరణం చేశారా అని ఒక అక్షరజ్ఞాని వాదిస్తున్నాడు.

6. ఎవరిమనస్సునుబట్టి వారు ప్రపంచానికి అర్థం చెబు తారు: కొందరు పాలక సంఘాధ్యక్షులకి మేష్టర్లని బదలాయిం చడంతప్ప మరొక సంగతి ఎంతమాత్రం తెలియదని ఒక మేష్టరు వాదించాడు. అది కేవలం పొరపాటనిన్నీ. కొందరు అధ్యక్షులకి మరొక సంగతికూడా తెలుసుననిన్నీ, అదేమిటంటే ఆడమేష్టర్లు స్వయంగా బయల్దేరి వెళ్ళి తమదర్శనం చెయ్య నందుకు వారిమీద ఆగ్రహం దాల్చడం అనిన్నీ, ఒక ఆడ మేష్టరు వాదించింది.

7. వసుదేవుడు కృష్ణుడిమీది ప్రేమకొద్దీ, ఒక శిల్పిని రప్పించి, కృష్ణవిగ్రహం చేయించి పూజచేస్తూ ఉండేవాడుట. ద్వాపరయుగాంతంలో ఆ విగ్రహాన్ని జాగ్రత్తగా భూమిమీదికి దింపి బృహస్పతిగారూ వాయువుగారూ ఇండియాలో ప్రతిష్ఠించారట. బృహస్పతిని గురుడు అని అంటారు గనక ఆ ఊరు గురువాయూరు అయిందిట. ఇదిగాక, మరిరెండు మోస్తర్లగా గురువాయూరుకు అర్థం ఉందిట. గురు—బృహస్పతులంత పండితులకిన్నీ, వాయు-అనగా గాలికబుర్లు చెప్పేవాళ్ళకినీ, వాదన్లు జరుగుతాయి అనిట! మరొకఅర్థం ఏమిటంటే; గురు గొప్పదైనటువంటి, వాయు—కీళ్ళవాయువు—నెప్పితో, ఇక్కడే ఉండాం ముందుకి నడవలేం—అని బాధపడుతూ కొందరు వాదిస్తారనిట. వాగ్వాదనలో అంతా రైటే, క్రియాసాధన మాత్రం వేరు.

8. అభినవ హరిశ్చంద్రుడు సత్యవ్రతం దాల్చడం అవసరం అని గ్రహించి కొంత లోకజ్ఞానం సంపాదిస్తున్నాడు. అయినా, అతడు వనంలో ఉండడంవల్ల చెట్లక్రింద ప్లీడర్లని ఋణసమస్య గురించి సలహా అడుగుతున్నాడు. అభినవ విశ్వామిత్రుడికి రాయవలసిందని వాళ్ళు చెప్పారు. ఇతడు సుమారుగా రిఫ్రెష్‌మెంటు రూములో దొరికాడు. అతడు హరిశ్చంద్రుణ్ణి తిట్టినా అన్టిల్ ఫర్‌దర్ నోటీసు హరిశ్చంద్రుడికి మారటోరియం ఇచ్చేశాడు. అభినవ చంద్రమతితో

పడలేక హరిశ్చంద్రుడు సత్యవ్రతాన్ని ఉపసంహారం చేసుకుని, తాను మనుష్యుడైనట్టు ప్రపంచానికి దాఖలాయిస్తాడని అనుకుంటున్నారు.

9. భక్తి, మనస్సెట్టా, కొందరు తమభక్తి సంగతి దేవుడికి తెలిసినా మానినా, తోటిమానవులకి తెలియదేమో అనే భయం చొప్పున, వాక్కాయకర్మలచేత మాత్రం ప్రకటిస్తారు. బాహ్యప్రకటన చేసే ఒకాయన కొయ్యబారి పోవడం, చుట్టుపక్క జనానికందరికీ ఎందుకో తెలియకుండా ఆనంద బాష్పాలు రావడం, అప్పుడు ఇతను హారతికర్పూరం వెలిగించిం తరవాత ఆయనకి స్మారకం రావడం జరుగుతో చ్చింది. ఒక దాసు నేను మట్టుకు ఈ మాత్రం కొయ్యవలెగా అనుకుని, మర్నాడు, జనంతో మాట్లాడుతూ మాట్లాడుతూ 11 గంటలవేళ విరుచుకుని పడిపోవడానికి సన్నాహం చేశాడు. కొందరు "అరెరే! దాసుగారు పడిపోతున్నారు, హారతికర్పూరం తెండి, తెండి!" అని కేకేశారు. అక్కడున్న ఒక గుమాస్తా, "ఇప్పుడు దుకాణాలుండవ్!", అన్నాడు. అది ఎక్కడ వినపడిందో దాసుగారికి వినపడి, ఆయన ఆ రాత్రికి కొయ్యవడం మానుకున్నాడు.

10. ఒకచోట గారడీ జరిగింది రెండువందల జనం పోగయారు. గారడీవాడు చేస్తానన్న పన్లలో ఒక తమాషా ఏమిటంటే మనిషిని మాయంచెయ్యడం. సభవారు తమ ఇష్టం

వచ్చిన మనిషిని చూపిస్తే ఆ మనిషిని మాయంచేస్తానని గారడీవాడు చెప్పుగున్నాడు. అప్పుడు ఒక బల్లమీద ఒక్కగా కూచున్న ఒక ఆసామీని వెళ్ళి బుట్టలో ప్రవేశించమని సభవారు పట్టుపట్టారు. అతను ఒక్కక్షణం నసిగి మొట్టుకి ఒప్పుగుని బుట్టలో దూరాడు. గారడీవాడు అతణ్ణి మాయంచేసి ఒక అర గంటకి మళ్ళీ తెప్పించాడు. సభవారు గారడీవాణ్ణి మెచ్చుకుని బహూకరించారు. కాని, మాయమైన మనిషికి చిక్కొచ్చింది. అతడు బేడ్రెస్సులో ఉండేపోలీసుట! అతడు మాయమైఉన్న టైములో మరొక అధికారి అక్కడికివచ్చి సభ గమనించి అతడు డ్యూటీలో లేడని రాసుగుపోయాడు. తరవాత, సభవార్ని గారడీవాణ్ణీ సాక్ష్యం చేసుగుని తనక్కడ ఉన్నట్టు మాయమైన మనిషి రుజువు చేసుగున్నా అతను సభయొక్క కార్యక్రమంలో పాల్గొన్నాడని పై అధికారి మళ్ళీ రాసుగుని పోయాడు. అతణ్ణి ఆ పన్లోంచి తగ్గించి మరో భారీపని యిచ్చారు.

భూకంపం

మొన్నటి భూకంపంయొక్క ఫలితాలు అందరూ వినిఉంటారు. ఔదార్య దాల్చి బిహారులో కష్టపడుతూన్న వారికి సహాయంచేసి ఉంటారు.

పరదేశ జ్యోతిష్కులు ఎవళ్ళూ దీన్ని గురించి ముందు చెప్పకపోయినా ఒక హిందూ జ్యోతిష్కుడు మాత్రం చెప్పాడు. ఉత్తర హిందూస్థానానికి నాశకరం అయి, దక్షిణహిందూస్థానానికి కొంచెం పైత్యకరంగా మాత్రం పరిణమించింది. ఇక్కడ ఎవరిమట్టుకువారు నూనె పిండివంటల అమితస్వీకరణంవల్ల హెచ్చైన పైత్యం మూలాన్ని కలిగిన శరీరకంపం అనుకుని కొన్ని చోట్ల దగా చేసిన తిలఘాతుకుల్ని దండించడానికి వెళ్ళారట. ఒకచోట క్షౌరశాలలో ఒకాయన క్రాపుచేయించుకునే వేళ చెవి కత్తిరించుకుపోయి, ముక్క ఊడి అవతల పడగా తనూ మంగలీ నువ్వ్యాకదిలావంటే నువ్వ్యాకదిలావ్ అని అతనిజుట్టు ఇతనూ ఇతనికి మిగిలినజుట్టు అతనూ పట్టుగుని వీధులోకి రాగా భూకంపం సంగతి వారికి బోధపరిచి, వార్ని విడిపించడంలో, ఒక సనాతనుడు "పొద్దున్న క్షౌరం చేయించుగోవాలని ఎందుకన్నారుమరి!" అన్నాడట. ఒకాయన

కొంచెం భారీగనిపి, అనగా టన్నులో ఒకదశ. ఆయనకు పట్టింది. ఆయన వచ్చి, "నేను కూడా మా అరుగు మీంచి దొర్లొసండి!" అన్నాట్ట అప్పుడు ఆయనకి భూభారం ఆరు మహాక్షితుల టన్నులనిన్నీ (మహాక్షితి-అంటే 1 తరవాత 21 సున్నాలు మాత్రం రాయాలి)—అల్లాంటి భూమిలో తన్ను పోల్చుకోడం ఆట్టే వీలుండదనిన్నీ నచ్చ చెప్పారట. భూకంప కారణాలుగా శాస్త్రజ్ఞులు చెప్పినవి ఉన్నాయిగాని, అవికూడా ఊహలే, అనుమానాలే. భూభాగం ఎక్కడేనా అండజారినట్టు జారినా, కొత్తపర్వతాలు చీలి ఏర్పడినా, అగ్నిపర్వతం తయారీలో ఉన్నా, గాలి ఒత్తుడు పడిపోయి శీతకాలం అయినప్పుడు ఇవి వస్తాయన్నారు. ఆకాశానికి భూమికి కూడా వణుకొవుడుతుందనీ, లోపలఉండే బొగ్గుగనులు అంటుకుంటాయనీ ఒకాయన అన్నాడు. అది బీహారు, అస్సాములోనే రావడం ఏమీ అంటే ఇండియా యొక్క నిర్మాణప్రకారం అస్సామే ఇండియా మొత్తానికి కేంద్రమంటారు, అమెరికాకి చిలీ లాగ. ఆ దేశపు ప్రజల సంఘుగ్రహాచారమని పామరులు అనుకుంటారు. 1897 లో దారుణ భూకంపానికి అస్సామే దెబ్బతింటా. ఇతర కారణాలు మాత్రం కొన్ని చెప్పుకు తీరాలి. ఇండియాలో జరిగి ఉన్న పాపాలకని కొందరన్నారు. హరిజనోద్ధరణ చెయ్యక పోవడంవల్లనని కొందరు చెయ్యడానికి యత్నించడంవల్లననేనని కొందరు. పంచములు

దేవాలయప్రవేశం చెయ్యడం నించి అక్కడవాళ్ళందరికీ —అనగా దేవుళ్ళకి, వాళ్ళ పెళ్ళాలకీ, పరిచారకులకీ వస్త్రాలకీ భయం వెయ్యడ వల్లనని కొందరు. ఇద్దరు శ్రోత్రియులు ఒకచోట దెబ్బలాడుకోడంలో "శారదా చట్ట మేమిటి, లేకపోతేనూ! భూకంపం గాదూ!" అన్నాడు. ఒకడు. రెండో ఆయన, "అది నేను ఒప్పుగో నయ్యా! భూమి ఇప్పుడు ఊగిసలాడుతా ఎందుకంటే, చట్టం ఆపుదామా వద్దా అని ఊగిసలాడుతూన్న విడాకుల చట్టంమీద కోపంకొద్దీనయ్యా! మహాప్రభో!" అన్నాడు. ఒక కాలేజీవిద్యార్థి నడిగితే "కాలేజీల్లో ఇంతేసిమంది కుర్రాళ్ళని పరీక్షకి పంపకుండా ఆపేసెయ్యడం ఏమిటండీ, లేకపోతేనూ! ఏమిటి దాని అర్థం—వాడ్డజిట్మీన్ ? ఇటు వంటప్పుడు "ఎర్తుక్వేక్" అన్నమాటేమిటి, "హెవెన్ క్వేక్" కూడా వస్తే రావచ్చు!" అని కోపపడ్డాడు. ఒక బియ్యే నడిగితే, "డబ్బెట్టి చదివి నిరుద్యోగశాఖలో చేరి ఉన్నవాళ్ళ జీవితభారం వహించడానికి భూమి తహ తహ లాడుతోంది" అన్నాడు. తనలోనే లోకం— అధమం భూలోకం!

## పేపరుమిల్లు

ఆంధ్రులయొక్క ధనం, ఆంధ్రులయొక్క కలిసికట్టు తనం, ఆంధ్రులయొక్క కార్యనిర్వాహకత్వం, ఆంధ్రుల

యొక్క ఓర్పూ, ఆంధ్రులయొక్క పరవిశ్వాసం—ఇవీ యింకా పోలేదు వీటికి సంబంధించిన లక్షణాలకీ శాశ్వతమైన ఉదాహరణగా పేపర్ మిల్లు వెలిసింది. దాని సంగతి ఏమైందని చాలామంది అడగనే అడగరు అదీ ఆంధ్రత్వమే! ఇంగ్లండులో తయారవుతూన్న తెల్లకాగితంకంటె (తెల్లకాగితానికి ఇంగ్లీషుభాషలో వైట్ పేపరు అంటారు) మిక్కిలి తెల్లగా ఉండే కాగితం తయారు ఎట్లా చెయ్యాలా అనిన్నీ, అది ప్రజ అంగీకరించి స్వీకరించేటట్టు చెయ్యడానికి మార్గాలు ఏవా అనిన్నీ ఆలోచన జరుగుతూండడంవల్ల ప్రస్తుతం ఆగి ఉన్నదని ఒకరు అన్నారు. కాని, నడపలేక ఆపి దాన్ని అట్లానే ఉంచిన వారికిన్నీ వచ్చి నడుపుతాం అని పూనుకుని అభయహస్తం ఇస్తూండేవారికిన్నీ జరిగిన ఒడంబడికలో వరతుకాలం ఆట్టేలేదు అనిన్నీ అందులో కొంత గతించి యిక కొంతే మిగిలి ఉన్నదనిన్నీ, వ్యవహారం గురించిన కాగితాలు కట్టుదిట్టంగానే ఉన్నాయనిన్నీ, కాగితాల మీదనే దాని వ్యవహారం ఉందిగనక దాన్ని పేపరమిల్లు అనడంలో ఏమీ తప్పులేదనిన్నీ ఒకరు సమర్థించారు.

## విమానం మీద పన్ను

రైలుపడ్డ కొత్తరికంలో, పట్టాలు ఏ ఊరిమీదుగా పడ్డాయో, ఆ ఊరివాళ్ళకి కొంచెం గర్వాగా ఉండేది. స్టేషను పడిందనుకోండి మహా, ఓ, మరీ ఇదిగా ఉండేది.

ఆ చుట్టుపక్క పల్లెటూళ్ళవాళ్ళకి కొద్దిగా చిన్నతనంగా ఉండేది. కాని, విమానం ధర్మమా అని దాని నడక్కి పట్టాలు లేవు. అది పల్లెటూళ్ళమీంచి కూడాపోతూండడంవల్ల, వాళ్ళకి కూడా కాస్త పదవి హెచ్చింది. టపావిమానాలు ఏర్పైన తరవాత చాలా కుగ్రామాలకి మంచి పేరొచ్చింది. కాని, మునిసిపాలిటీలకి కొంచెం ఆలోచనగా ఉంది. విమానం ఊరుమీంచి వెళ్ళేటప్పుడు, అది మునిసిపల్ హద్దుల్లో వెళ్ళినట్టే అనిన్నీ, అది దారుణమైన నాదం చెయ్యడంవల్ల, బస్తీప్రజ కందరికీ పని చెరుపనిన్నీ, 'పైనపడితే మిమ్మల్ని ఎంజేశాం?' అని విమాన యజమానులు అనకూడదనిన్నీ, పైకి గాలి ఎంతవరకు వ్యాపించి ఉంటుందో అంతమేర లోనూ ఉండే గాలీ—దాని తాలూకు వాసనాదిద్రవ్యాలూ కూడా కేవలంగా మునిసిపల్ సొత్తే అనిన్నీ, అందుచేత హద్దులలోంచి వెళ్ళే విమానాలమీద సబురు ఒక్కంటికి ఇంతా అని పన్ను ఉంటుందనిన్నీ, ఒక వేళ గడుసుతనంగా ఎవరేనా హద్దులుదాటించి వెళ్ళేయెడల వాళ్ళకి ధ్వని గురించిన పన్ను ఉంటుందనిన్నీ, ఒక వేళ ధ్వనిలేని విమానాలు కొద్దిరోజుల్లో వచ్చినా రూపం కనపడడంచేత పన్లు ఆగిపోయి తీరతాయిగనక రూపం గురించిన పన్ను ఉంటుందనిన్నీ, ఒక మునిసిపాలిటీవారు విమాన యజమాన్లకి రాయవలసిందిగా తీర్మానించుకున్నారు. పైకి చూడడంవల్ల జనానికి పట్టే మెడనొప్పులకి తాము ఎంతమాత్రం

బాధ్యులంగాం అని కూడా వారు ప్రచురించారు. ఒక్కవేళ విమానంవారు, అందరికంటే పైవారు గనక, ఈ చర్య సక్రమం అని ఒప్పుకోక ఉడాయించి పారిపోతే, మరి గత్యంతరం లేదనిన్నీ, అందుకు నేలమీదవాళ్ళే తగు సంజాయిషీ రాతపూర్వకంగా ఇవ్వవలిసి ఉంటుందనిన్నీ, సరదాగా జనం వచ్చి చూస్తాం గనక వారి దగ్గిర ప్రేక్షణాసుంకం తప్పకుండా వసూలుచేస్తాం అనిన్నీ, ఏతద్విషయంలో తగు ఏర్పాట్లుచేసి వసూళ్ళలో అక్రమాలు జరక్కుండా చూడడానికి ప్రేక్షకుడు ఒక్కంటికి ఇద్దరేసి గుమాస్తాల్ని—ఒకర్ని ఒకరు మింగేవాళ్ళని—నియమిస్తారనిన్నీ, వచ్చిన డబ్బెట్టి దుమ్ము రేగని రోడ్లు వేయిస్తారనిన్నీ తెలుస్తోంది. ఒకవేళ పైన పోయేవారు ఏ ఉడుకుమోత్తనంచేతో ఊరిమీద బాంబులుగాని విషవాయువులు గాని వదిలివెళ్ళిన పక్షంలో బస్తీ జనం చూడడానికి రాకూడదనిన్నీ వస్తే నాసికా రక్షలతో రావాలనిన్నీ, తమ ఆజ్ఞకు విరుద్ధంగా ఉత్తముక్కులతో విహరించి విషవాయువులు పీల్చి గతించినవాళ్ళ దగ్గిరనిలబడ్డ పాట్న మరణపు పన్ను వసూలు చెయ్యవలసిన అవసరం రావచ్చుననిన్నీ కూడా వారు చాటించారు.

---

[ మా ట వ ర స (5)—1937
అ ర్ట్సు కా లే జీ లో
28—2—1937 తారీఖున
పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో
శ్రీ వల్లూరి సూర్యనా
రాయణ రావు గారి
అధ్యక్షత క్రింద జరి
గిన సభలో చదివినది. ]

## బస్తీ - దుమ్ము

బస్తీగోడ్డు కేసి చూస్తే జీవితం అంటే పెద్దపోటీ పందెం అనిపిస్తుంది. ఈ పందెంలో ఎవడి బాధ వాడిది అని తెలుస్తుంది. సకల మానవసమత్వం తెలిసి నమ్మినప్పటికీ, ప్రతీవాడూ మరోణ్ణి దిగదొక్కి ముందుకి తను పెందరాళే వెళ్ళాలని చేసే ప్రయత్నం ప్రత్యక్షం అవుతుంది. పెందరాళే వెళ్ళాలంటే వేగం ఎక్కువుండాలి. ధనవ్యయం చేస్తే గాని వేగం సిద్ధించదు. అందుచేత ధనవంతుడు బయల్దేరి, అనవసరంగా, తాత్కాలికంగా తనంతట తను తనకి ఆరోపించుకున్న అధికారాన్ని ప్రపంచంమీద చలాయిస్తాడు. ఆ చలాయింపుకూడా మనం చూడవచ్చు. మనిషిని తప్పుకోమని బళ్ళవాళ్ళు అందులో రెండెడ్ల బండివాణ్ణి ఒంటెద్దు బండివాడు, వీళ్ళిద్దర్నీ జట్కామనిషి, వీళ్ల

ముగ్గుర్నీ రెండుగుర్రాల కోచివాళ్ళు. వీళ్ళనలుగుర్నీ . సైకిల్ వాళ్లు పాపం, రెండెడ్లబండివాడు మనుష్యుల్నీ తప్ప మరెవర్నీ తప్పుకోమని తిట్టడానికి లేదనుకున్నాను కాని, ఒకచోట ఒక రెండెడ్లబండివాడు ముందున్న ఒకబండిని తప్పుకోమంటున్నాడు. తీరా ఏమిటా అని చూస్తే, ఆముందుది పోతులబండి! సరె, ఇదాఖరు, వీడు మరి తప్పుకో మని తిట్టడానికి ఏ వాహనం లేదనుకున్నాను. కాని మరొక సందర్భంలో ఒకపోతులబండివాడు ముందున్న బండి వాణ్ణి 'తప్పించు, కళ్ళాపట్లా?' అని మోటుగా తిడుతున్నాడు. ఏంచెప్మా అని చూసేసరికి—ఆ ముందుబండికి కట్టింది ఒక యెద్దూ ఒక పోతూను! పెత్తనం ఇచ్చే దాతెవడేనా ఉండాలి గాని, పెత్తనం ఇచ్చి నెత్తియెక్కించుకునేసరికి, పేనుకూడా తలంతా కొరికెయ్య గలదు. వీళ్ళందరికీ పైవాడు సైకిలిస్టు. ఇతను నోరు విప్పకుండానే గంట గిలగిలలాడించి అధార్టీచేస్తాడు. వీళ్ళందరికీ పైవాడు మోటారుసైకిల్ గారు. ఆయన కేవలం జనం వగైరాల్ని హారొత్తగొట్టి డబడబలాడించి దారి పుచ్చుకుంటాడు, అతని ధోరణిలో కొంత లయ ఉందని గానశాస్త్రజ్ఞులు దెబ్బలాడితే ఆడచ్చుగాని, పామరుల ప్రాణానికి అది ప్రళయంగా ఉంటుంది. దుమ్ము రేకొట్టడంలో అతడు ప్రథముడు, బస్సు వీరికి పైమాట. మహాబస్తీలో తప్ప కడంచోట్ల వీలయినంతమందికి నోట మట్టికొడితేగాని దానికి తోచదు.

ఒక వ్యక్తి తాలూకు స్వంత కారు వచ్చేసరికి వీరంతా దారి వదలాలి. డ్రైవరుయొక్క ఔన్నత్యం చక్రత్వం గమనించడానికి ప్రస్తుతం సావకాశం చాల్దు "బతకవురా! సావాలనుందా! నూకల్లేవురా! కళ్ళులేవురా! చెవుడ్రా! బుద్ధిలేదురా! యెదవా!" అనే మార్దవ గాఢండే మందలింపుల్లోనూ, అవాచ్యాలైన మరి యితర మాటల్లోనూ, ఎంత గొప్పవాడైన పాదచార్లైనా సరే సాధారణంగా ఉత్తపుణ్యానికి డ్రైవర్లు కొందరు సరదాగా, అలవాటు చొప్పున హెచ్చరిస్తారు. అందుచేత ఎంతహడావిడీ అల్లరి చేసి, ఎంతదుమ్ము రేగకొట్టే రోడ్డుమీద అంత గొప్పవాడుకదా అని మనకి తెలుస్తుంది. ఒకస్వంత వ్యక్తిది కాకుండా, ఒక సంఘంతాలూకు కారైతే, ఆడ్రైవరికి భూమిమీద ఎవ్వరూ అడ్డు ఉండకుండా తప్పుకోవలసిందే, కాని ఈశ్వర వేరు ఉండితీరుతుంది. రావణుడికి మైరావణుడుంటాడు. అల్లానే ఎంతకొమ్ములిరిగిన కారుడ్రైవరుకీ కూడా అప్పీలుంది. గట్టిపదార్థాలు చెప్పమంటే ఓకుర్రాడు 'ఇనుము' అని చెప్పాడట. ఇంకా గట్టిది 'ఉక్కు' అని చెప్పాడట. ఇంకా గట్టిపదార్థం ఏది అని అడిగినప్పుడు 'దున్నపోతు' అన్నాట్ట. మేష్టరు. 'అదేమిరా' దున్నపోతా ఉక్కుకంటే గట్టి?' అని కోపపడ్డాట్ట. అప్పుడు కుర్రాడు, 'అవునండి, ఉక్కుతో చేసిన కార్ని దున్నపోతు ఆపేస్తుందండి' అన్నాట్ట. అల్లాగ్గా, దున్నపోతుగారుగాని;

లేక వారి తాలూకు పట్టమహిషి కాని, ఎంత కార్యవ్యాది ఎంత హోరుచేసినా లక్ష్యపెట్టక చెక్కు చెదరకుండా కార్ని ఖనాయించి ఆపేది, అవలీలగా ప్రైజు పుచ్చుకుంటుంది. ఇక్కణ్ణించి మనం నామ్యఘట్టంలో ప్రవేశిస్తాం. అందుచేత, ప్రస్తుతం బస్తీరోడ్లమీద మనకి కనిపించే యితరదృశ్యాల్ని వొదిలేసి చూడ్యాలి. అవి ఏవి అనగా, సైడుకాలవలు: సైడు కాలవల్లో ఉన్నన్ని వర్ణభేదాలు ఎక్కడా లేవు. అవి ఓ ప్రక్కగా ఏడవండర్రా అంటే అల్లాఏడవక, స్థితి పాడుచేసుకుని, రోడ్డుకి అడ్డంగా నడుస్తాయి భయభక్తుల్లేకుండా! వాటిలోనీరు: దానికి, రామరామ, బొత్తిగా సిగ్గులేదు. పాతనీరు ఎండమంటే ఎండదు, ఆయిలు చిలికినా మండమంటే మండదు, పోనీ కంపులేకుండా ఉండమంటే ఉండదు. తననిగురించి అడ్డమైనవాడూ తలోమాటా అని తలోతిట్టూ తిడుతున్నారని అది లోపల్లోపల తెగి కుళ్ళికుళ్ళిపోతూంటుంది. 'నిజం దేవుడెరుగును, నీరుపల్లం ఎరుగును' అని శాస్త్రం. మనం నిజాన్ని దేవుణ్ణీ కూడా ఎరగం గనక, నిజం దేవుడెరుగునని నమ్మితే నమ్మొచ్చు. కాని ఈ సైడుకాలవలకేసిచూస్తే 'నీరు పల్లం ఎరుగుండడం' సందేహించవలిసొస్తోంది. వాటిల్లో నీరు 'నీరు' అనే శబ్దానికికూడా అప్రతిష్ఠ తెస్తోంది, ప్రతిష్ఠతో ఉంటున్నాననుకొని. దానికి పల్లం ఏవేపో తెలియకపోతే చస్తామా మరీ! పొద్దున్న తూర్పుకి వెడుతూంటుంది, మనం ఏదో పని చూసుకుని కాస్సేపట్లో చక్కావచ్చి

మళ్ళీ చూసేసరికి పడమటగా పోవాలని తంటాలు పడుతూం టుంది, దిక్కుమాలి తంటాలుపడడం ఇదీనూ! ఇవిగాక, పైపులు: అక్కడ స్నాన, పాన, క్షాళన, గ్రహణ, క్రీడ వగైరా ఉద్దేశాలతో అనేక జనం పోగవడం! ఒక్కొక్క ప్పుడు కుంభమేలా: ఘటవాయిద్యం: మాతృభాషలో ఉప న్యాసపు పోటీలు: అక్కడే యుద్ధాలు—జిహ్వాస్త్ర ప్రయో గాలు. ఆ పైపుప్రక్క బస్సు జంతువులు: అనేకదూరం, శ్రమ పడి, తొందరగా తిరిగి రావడంవల్ల అనేకరకాలు మాలిన్యం పొట్టనెట్టుగుని స్వగ్రామం వెంచేసిన అంచీబస్సులు. వాటిని పరిశుభ్రంగా పై చెప్పిన మాలిన్యం యావత్తూ అక్కడా అక్కడా పడిపోకుండా, మంచినీళ్ళు తీసుగునే చోటే పరిచి ఉంచితే, యథాశక్తిగా జనం ఆరగిస్తారు, ఎక్కడి కక్క డికే ఆయిరి అని పైపుపక్కనే, పల్లెటూరిచెర్లో గేదెల్ని కడిగినట్టు, ఈ బస్సుల్ని కడిగడం. ఇంకా రకరకాల కం పులూ; వాటికి ఆటపట్టులూ: వగైరా వగైరా ఉన్నాయి. అవన్నీ వొదిలి దుమ్ము గురించి మాత్రం కొంచెం ముక్కు పట్టుకుందాం.

దుమ్ము హైరోడ్డుమీద ఎక్కువ ఎత్తుగా లేస్తుంది. అల్లా పైకి, లేచిపోవడంలో దానికి దురుద్దేశం ఎంతమాత్రం లేదు. సరిగదా, దాని గోలంతా ఏమిటి అంటే, 'హై రోడ్డు' అనేదాన్లో 'హై' అనేది సార్థకం చెయ్యాలనే. అందుకనే కోచిబళ్ళమీద కూర్చుని, అశ్వాల్నితోలేవాళ్లూ

వాళ్లూకూడా 'హై' అనడం. పైగా ఆ దుమ్ముని వింజెయ్య మన్నారు? అల్పులు ఎగిరిపడతారనిన్నీ, ఈ చస్థితిలో వాళ్ళని కదిపితే, ఇల్లానే, కదిపిన వాడిమీదే కాకుండా దారిపోయే వాళ్ళ నెత్తిమీదకూడా కైటాయిస్తారు అని కూడా ఋజువు చెయ్యాలని అది బయల్దేరింది. బస్తీదుమ్ము బాగా మరిగి కొందరు పొడుం పీల్చడం మానేశారు. అందుకని నస్యవర్త కులు కొందరు పొడుంకొట్లు ఎత్తేసి, దాంతో ఐ. పి. పెట్టే శారు. కొందరు, పొడుం చేసుగోడానికి గాని, కొట్టుదాకా వెళ్ళడానికిగాని బద్ధకించినవాళ్ళు, హైరోడ్డు మొగలో మాట లెట్టుగుని, గుక్కఅయిపోనిచ్చి, తమరి తాతగారి సొమ్ము లాగ, ఒక్కొక్కపీలుపుకి మూడేసి గజాల దుమ్ము పీలు స్తూంటూరు. ఏదోవిధంగా, నలుగురూ, జాతిమత వివక్షత లేకుండా, బస్తీదుమ్ము మూలాన్ని ముక్కుమూసుగుని నడిచి పోతూ, (తిట్టుగోడానికేనా వీల్లేకుండా, అంతకుముందే నోరు మూసుగుని) సనాతన ధర్మం నిలబెడుతూ. యోగసాధన విషయంలో ప్రథమప్రయత్నాలు బలవంతం మీద చేస్తు న్నారు. ఈ దుమ్మువల్ల ఉఫ్ అంటే ఎగిరిపోయే జనంకుడా కొంచెం గురుత్వం, భారీతనం సంపాదిస్తున్నారు. బస్తీదుమ్ము వల్ల హైరోడ్డు పక్కల గోడలకి మందం పెరిగిపోడాన్ని చూసి, గోడలకి కూడా పెరగడం ఉంటోంది గనక, చెట్ల లాగ ఏదో ఒక రకం జీవం వీటికికూడా ఉండితీరాలని ఏ ధురంధరుడో కని పెట్టకపోతాడా అపూర్వవ్యాసాలు ప్రక

టించి పట్టాపుచ్చుకోకపోతాడా అని, కొన్ని పరిమితుల్లో తన్నిమిత్తం పట్టాలు చేయించి, మెరుగెట్టించి, 'రడీ' లో ఉంచారు. 'దుస్థితి' అంటే దుమ్మువల్ల కలిగేస్థితి అనే విగ్రహం చెయ్యించాలని కొందరు అన్నారు. సృష్టి, స్థితి లయాలు దుమ్ములోనే నని మనికి బస్తీదుమ్మువల్లే తెలిసొస్తుంది. దుమ్ముకేసి చూస్తే, అస్నిందాలా మానవుణ్ణి తను కని పెడుతూంటే, మానవుడు కనికరం లేకుండా తనని ఉపయోగించినందుకు, మరి ఓర్చుకోడం దుర్భరమై భూమి మానవుణ్ణి దుమ్మెత్తి పోస్తోందా అనిపిస్తుంది. ఇప్పటిదాకా కొందరు జనం 'కళ్ళజోణ్ణి' పట్టుగుని 'ముక్కద్దా' లనీ, 'ముక్కుజోడనీకూడా వాడేస్తున్నారు. ఇక అల్లాంటివాళ్ళ ఆటలు సాగవు. బస్తీదుమ్ము ధర్మమా అని ముక్కురాష్ట్రానికి ప్రత్యేకపు జోడు ఏర్పాటు కావచ్చు. కాళ్ళకి రకరకాల జోళ్ళు ఉన్నాయనీ ( అంటే బంగారంవీ, వెండివీ, ఇనుపవీ, కర్రవీ )— చేతులుకి జోళ్ళున్నాయనీ, కళ్ళకి జోళ్ళు సరేసరి అని,— చివరకి కర్మదశ చెవులకి గుడా జోళ్ళుండడం ఏమిటి, మాకు లేకపోవడం ఏమిటి అని ముక్కురంధ్రాలు చిరకాలం భగవంతుణ్ణిగురించి వాయుభక్షణ మాత్రం చేస్తూ తపస్సు చేశాయట. "క్రమేపీ చుట్టుప్రక్కలవాళ్ళందరికీ రాష్ట్రాలు ఏర్పడనీండి. ఆ పని జరిగిపోయిం తరవాత మిగిలిపోయింది దానంతటది అదే మన స్వంతరాష్ట్రంగా ఏర్పడుతుంది. ఇం కోర్కి అడగా అక్కర్లేదు. వాళ్ళు ఇవ్వా అక్కర్లేదు.

మనం దానం పట్టా అక్కర్లేదు" అని ఆంధ్ర జనవైతాళికుల్లాగ ఊదుకోక అని తపస్సు చేసేసరికి, "మీకు జరిగిన అన్యాయం కారుయుగం రానీండి తొలగిస్తాను" అని ఆయన అన్నాట్ట. కారుయుగం అంటే కారేజి. అదే ఇంగ్లీషులో గారేజి అని అంటున్నారు—అరవ సాంప్రదాయంలో 'క' కారాలు 'గ' కారాలుగా మారతాయి గనక ఎంత గొప్ప వాళ్ళయితే, పట్టపగలు అశేషజనానికీ, కళ్ళల్లో దుమ్ము చల్లగలవారుంటారుగదా అని రోడ్డు మీదే తెలుస్తుంది. అటువంటప్పుడు, ఇక రాత్రి వేళ అడిగేదేముంది కథ! సాయంత్రం పడ్డాగానే కార్లు, ఇంటి మొహాం పట్టిన యెడ్లలాగ మరీ జోరుగా నడుస్తాయి. ఎంచేతంటే, పగలైతే వినపడడం కోసం కుయ్యాలి, రాత్రి కనబడితే చాలు. వెలుగుయొక్క వేగం శబ్దం వేగానికి లక్ష రెట్లు, మళ్ళా మాట్లాడితే పదిలక్షల రెట్లు. అందుకని రాత్రి వేళ కారు చాలా దూరంలో ఉండగానే ఆధూళిమండలంలో కారు దీపోదయం అయి మనకీ వచ్చే కారుకీ మధ్యనుండే జన జంతు శకటాదులు అన్నీ ధూళి తెర మీద ఆడుతూన్న నవీనయుగపు తోలు బొమ్మల్లాగ, తెల్ల కాగితంమీద సిరాబొమ్మల్లాగ మిక్కిలి శోభగా ఉంటాయి. అందరికీ ఏకరంగు ప్రసాదించడంవల్ల వర్ణభేదం నశించడానికిన్నీ, మధ్య జాగాలో ఉండే వీర్నీ వార్నీ కూడా ఏక కాలమందే అది తాకుతూఉండడంవల్ల అస్పృశ్యతా దోషం తొలగిపోడానికిన్నీ బస్తీదుమ్ము కిందామీదా తెలియు

కుండా పనిచేస్తోందని చెప్పొచ్చు. బస్తీహైరోడ్డుమీద, రాత్రి వేళ, జట్కాలో వెడుతూ, మా స్నేహితుడొకాయన,— ఆతడు ప్రబంధకవిత్వం తప్ప మెచ్చడు—'స్మర శిలీముఖ కుసుమ కేసర పరాగధూళి' — అనేది జ్ఞాపకం తెచ్చుకుని, అప్రస్తుతం అని తెలిసినా శ్రీనాథుణ్ణి పొగిడి, మెచ్చి అంతటితో ఆగక, ఆ దుమ్ముమీద కవిత్వం యత్నించి, బస్తీశృంగార వ్యవహార ప్రారంభోత్సవం సూచించడానికి బయల్దేరిన పుష్పబాణ విలాసఫలితం అన్నాడు. కొన్ని చోట్ల వీధిదీపాలు తామే చీకటికి భయపడి కళ్ళు మూసుగున్నట్టు కనిపిస్తాయి. ఒక్కొక్కప్పుడు మూడు నాలుగుకార్లు ఇటూ అటూ ఒకే క్షణంలోనే వెళ్ళడం గనక తటస్థిస్తే, వీధి దీపాలు ఎక్కడుంటాయో చెప్పుకోడానికి ఇతరదీపాలు పట్రావాలి. ఏమైనా చెప్పడం గగనం. రాత్రిభాగంలో వెలుగు కిరణాలకి దుమ్మునేది ఒక వైభవం తేవడంవల్ల, వెలుగులూ అడ్లూ నీడలూ గమనించి, గ్రహణాల కారణాలూ, రకాలూ ముక్కు మూసుగుని నేర్చుగోవచ్చు నని భూగోళధూళి శాస్త్రప్రియులు చెబుతున్నారు. ధూళిలేని పట్నానికి వర్షాలు నశించుతాయి గనక, ఇది మానవులకి అత్యంతోపయోగం అని కొందరిమతం.

## పదిరూపాయల టిక్కెట్టు

హద్దూ పద్దూ లేకుండా తిరగడాన్ని గురించి చెప్పేటప్పుడు తెలుగువాళ్ళు, కాలుగాలిన పిల్లిలా తిరగడం,

మారని డబ్బులా తిరగడం, తడిమన్ను పొడిమన్ను అయ్యేటట్టు తిరగడం, ఆసుకండిలా తిరగడం, అరువు సైకిల్‌లాగ తిరగడం అని అంటూంటారు. రైలు కంపెనీవారి ధర్మమా అని ఇటీవల 'పదిరూపాయల టిక్కెట్టువాడులాగ తిరగడం' అంటున్నారు. తిరగడానికి నియమించిన కాలం వెనక నెల ఉండేది. ఇటీవల అది చిక్కి సగం అయింది. ఆరోజుల్లో జనం కొత్తవార్ని కలుసుకోగానే, 'ఎప్పుడు రావడం?' అని హెచ్చరించి, 'నేను ఈమధ్య పదిరూపాయలు' అని అవతల వారు అనగానే, ఇంకా ఏం దస్తరం విప్పుతారో అని, 'అల్లానా! నాకు పనుంది సెలవు' అని చెప్పేసి బలవంతపు సెలవు పుచ్చుగుని పోతూండడం జరిగింది. ఈరీతిగా తెలుగు భాషలో చరితార్థులైనవాళ్ళని అందర్నీ అభినందించ వలిసిందే. రైలువాళ్లు మంచిపని చేశారని కొందరన్నారు. తెలుగువాళ్ళ ప్రథమావేశం, వేలంవెర్రీ, డబ్బుఖర్చు వేదాంతం ఎగసందోసి సొమ్ము చేసుకున్నారని కొందరన్నారు. "ఉన్న పన్లన్నీ దబ్బున చూసుగోవచ్చు, రండయ్యా!" అని రైలువాళ్ళు పిలుస్తూంటే రాం అని పట్టుపట్టడం భావ్యంకాదని, పన్లున్నవాళ్ళూ, పన్లున్నాయి అనుకున్న వాళ్ళూ పన్లేనివాళ్ళూ, ఏదోపని ఏర్పాటు కాకపోతుందా అనుకున్నవాళ్ళూ, 'ముందు టిక్కెట్టు కొనేసి ఓమూల్నుంచి సర్కీటు ప్రారంభిస్తే ఏ ఊళ్ళోదిగినా అక్కడ ఏ ఎరుగున్న వాడో, వాడులాంటివాడో దొరక్కపోతాడా, ఎక్కడో

ఎల్లాన్లో మకాం వెయ్యలేకపోతామా, కానీ! దేవుడున్నాడు!' అనుకున్నవాళ్ళూ, ఇంకా చాలామంది ఇతరులూ కూడా ఆ తరుణం ఉపయోగించుకున్నారు. టిక్కెట్టు పదిరూపాయలైనా, వందలకొద్దీ జనం చిన్న-పెట్టి స్టేషన్లకి గుడాఎగడి, వేలకొలది టిక్కెట్లు కొనుక్కోగా, రైలువారి కొచ్చిన డబ్బు లక్షలమీదా, బయల్దేరి తిరిగిజనం సంకల్పించుకున్న పన్లు కోట్లమీదా, ఈజనమూ వీరియొక్క దర్శన సమావేశ, పరిచయ ఆతిథ్యభాగ్యం పొందగలిగిన ఇతరజనమూ పడిన కష్టాలు శతకోట్లమీదా ఉంటాయని మాస్నేహితుడు ఒకాయన మదింపు వేశాడు. వీరిలో చాలామందికి నెరవేరిన పన్లు లెక్కకి అందవు. కొందరికి పన్లు ఒకట్లమీద అయినాయి. కొందరికి ఒక్కేపని నెరవేరింది—ఇంటికి చేరుకోడం—చాలామంది పని అయిపోయింది- కాలం అయిపోయి ఇల్లుచేరేసరికి కొందరికి౧౫రోజులపాటు నిరుద్యోగ సమస్య తెగిపోయింది. అందరికీ నిష్పక్షపాతంగా 'దశ' మారిపోయింది. రైలువారు జనానికి, ఇటువంటివే నూతనదశలు త్వరత్వరగా ఇప్పిస్తారనిన్నీ, వందరూపాయల టిక్కెట్టుమీద సంవత్సరమున్నూ, వెయ్యిరూపాయల టిక్కెట్టుమీద యావజ్జీవితమున్నూ తిరిగి పనులు చూసుగోవచ్చును అని అంటారనిన్నీ అప్పుడు బ్రతికున్న తెలుగువాళ్ళంతాకూడా రైళ్ళెక్కి ఇటో అటో ఎటో తమకే తెలియని స్టేషన్కి వెడుతూంటారనిన్నీ బ స్తీల్లోదుమ్ముతగ్గి, కంపుపోయి, జనం ఉండరు గనక

ఆరోగ్యం హెచ్చి, ఇళ్ళు చౌకై ఇంకాబోలెదు. ప్రయాణసా ధనాలు వాటంతట అవే సిద్ధిస్తాయనిన్నీ, ఎల్లానో అల్లా ఆశ్రమంలోనే కొత్త ఎన్నికలు పడేటట్టుచేసి కొన్ని కక్షులవారు ఒకటి మెజారిటీ తోటేచా నెగ్గాలని చూస్తున్నారనిన్నీ పామరులు అనుకుంటున్నారు. ఈరీతిగానే వెయ్యిరూపాయలకి ఓడమీద భూలోకయాత్రా టిక్కట్టున్నూ, మరికొంత కాలానికి ఓలక్షరూపాయలకి విమానంమీద సంపూర్ణగ్రహచారపు టిక్కట్టున్నూ దొరుకు తాయనిన్నీ, అప్పుడుజీవరాసులు సశరీరంగా ఈ రేదులోకాలూ పర్యటనం చెయ్యవచ్చునినిన్నీ శాస్త్రజ్ఞులు నమ్ముతున్నారు.

## కొత్త వోట్లు

'వోటు' అనేది తెలుగులోకి దిగిన ఇంగ్లీషుమాటల్లో ఒకటి. ఏట్లాటలో ఉన్న 'ఏటు' అనేది దీనికి కొంత సంబంధంగల తెలుగుమాట. కాని దానికి కేవలతుల్యంకాదు. మొన్నటి ఎన్నికల్లో అక్షరాస్యులు కాని భారతీయులుకూడా చాలా మంది తమవోటుసాధించారు. కంటపడే వస్తువు కాకపోడంవల్లచి 'వోటు' అంటే చాలామందికి తెలియులేదు. క్రమేపీగాని తెలియదు. 'ఈయాల వోట్ల నంబరంట, వోటంటే యేటిబాబూ!' అని నన్ను ఒక పరిచితుడు అడిగాడు. 'వోటు' అంటే 'ఇష్టం' అని చెప్పాను. 'నా యిష్టమేనా, బాబూ' అన్నాడతడు. 'నీయిష్టమేకాదు, ప్రతివాడి

ఇష్టమూ కనుక్కుని, మన్ని పరిపాలించడానికి మంత్రులు వగైరాలని తయారుచేస్తారు' అన్నాను. 'మరి, ఓటిట్టం అన్నారు కాదు బాబు, మరి!' అని మళ్ళీ అతడడిగాడు. 'అవును నిన్న ఎవరి సలహామీద పరిపాలన కావాలో ఆవ్యక్తిని ఎన్నుకోమన్నారు. అంతేగాని అలాగా పాలనా లేకుండా నీయిష్టం వచ్చినట్టు ఉండమన్లేదు' అన్నాను. 'ఓస్, ఇంతేనా బాబూ. అయితే నాకు తెల్దు' అనేశాడు. ముసిలాయన ఇంకా చల్లగా ఉండి దౌర్జన్యా హింసనూ అనిఉరుముతూండడంవల్ల కాకపోతే ఎన్నికలు ఇంత నెమ్మదిగా నడిచి ఉండవ్ అని చాలామంది నమ్మకం. ఈసారి ఎన్నికల్లో ముఖ్యవిశేషాలు రెండు. మొదటిది ఎన్నికలు రంగురంగుగా జరిగాయి—వర్ణఆశ్రమధర్మాన్ని అనుసరించి వ్యాపారంజరిగింది ఈ వర్ణవిశేషాలు మన రాజధానీ మరికొన్ని చోట్లనూ, ఇతర చోట్ల జంతువిశేషాలు! పోటీగానిల్చే అభ్యర్థుల్ని పార్టీ వారీగా రంగులు కోరుకోమన్నారు. ఒకపార్టీ ఎరుపు కోరుకున్నారు. ఎరుపురంగుకి అధిష్ఠానదైవం అంగారకుడు. ఎరుపు రంగు మ్యాపులమీద ఇంగ్లీషువారి రంగు. ఆరంగు లేతది దంభానికిన్నీ, ముదరది క్రోధానికిన్నీ, శక్తి, బలం, పట్టుదలా వీటికి చిహ్నమని జ్యోతిష్కుల సిద్ధాంతం. అల్లానే పసుపు రంగు. దానికి దైవం బుధుడు. ఆ విజ్ఞానానికి చిహ్నమని గ్రంథాలు చెబుతున్నాయి. ఆరీతిగానే ఆకుపచ్చకి, దైవం చంద్రుడనిన్నీ, రెండురకాల ఆకుపచ్చ ఉందనిన్ని ఒకటి

దగాకిన్నీ, రెండోది కరుణకిన్నీ చిహ్నాలనిన్నీ కూడా శాస్త్రాలు చెబుతున్నాయి. ఇదిగాక తెలుపు. తెలుపు వర్ణమే కాదనీ, ఒకవేళ వర్ణమే నంటే సకలవర్ణ సమావేశమనిన్నీ ఉంది. 'రంగులు-వాటితత్వములు' అని ఈ నడుమనే ప్రచురం అయిన ఒక గ్రంథంలో ఆకుపచ్చ అనే వర్ణం, పసుపుపచ్చ లోంచి విడిచిపోయిన వర్ణం అనికూడా ఉన్నది. నేను విలోమజ్యోతిష్కుణ్ణి అవడంచేత సంగతి జరిగిపోయిం తరవాత చెప్పవలిసొచ్చింది.

జీర్ణం కాకపోయినా 'వోటు' అనేమాట తెలుగు వాళ్లు ఎల్లానోమింగి ఇడవుతున్నారుకాని, ఈ తెలుగువాళ్ళ ప్రాలుద్ధంకొద్దీ మరోమాట బయల్దేరింది. అదిచాలా ప్రమాదాలుకూడా తెస్తోంది. ఒక ఇంగ్లీషు చదువుకున్నాయన ఒక రైతుతో 'ఏమయ్యా' 'బూతు' కి వెళ్ళివచ్చావా?' అని అడిగేసరికి ఆరైతు నాలుగువేళ్లూ అంటుగునేటట్టు ఆ పెద్దమనిషిని ఎడందవడమీద ముద్రకొట్టాడు. 'ఏమిట్రా ఫూల్' అని ఆయన అనేసరికి, రైతు ఆయన్ని ఇంకోటిచ్చుగుని, 'ఇంగ్లీషు సదివావు! బూతేటయ్యా నీకు!' అన్నాడు. అప్పుడు నలుగురూపోగై, రైతుని ఆపి, ఆయనమాటల్లో వ్యత్యాసం ఏమీలేదనీ, అది ఎన్నికల బూతనీ, చెప్పి రైతుని ఒప్పించి సాగనంపారు. 'ఈయాల పోలితీర్థంట్రోయ్' అని జనం అనుకోడంకూడా వినిపించింది. అది 'పోలింగు' కి వచ్చినపాట్లు! ఆవోట్లు వేసే భవనాలకి ఎదట నీడఎక్కడా లేకపోవడం

వల్లా! జనాజనా మనుష్యుల్ని లోపలికి వొదలడానికి స్త్రీలు కూడా ఉండడంనించి వీల్లేకా కొందరు ఎండలో చాలాసేపు ఖణాయించి, లోపలికి, వెళ్ళేసరికి, కళ్ళు పచ్చపడిపోయి, కామెర్ల మనిషల్లా అయి, అన్ని పెట్టెలూ పచ్చగా కనిపించి అసలు పచ్చపెద్దో కనుక్కోడానికి బాధపడ్డారు! అంధులికి పెట్టెలుండే వరస చెప్పి పంపించారట. భర్త పేరు చెవితేగాని ఒకావిణ్ణి వీల్లేదన్నారట. పక్కవాళ్ళు చెప్పినాసరే, ఆవోట్ల ఉద్యోగి, ఆవిణ్ణే చెప్పమని పట్టుపట్టారట — తలుపు దగ్గిర అమ్మలక్కలంతా పట్టుబట్టినట్టు! ఆవిడ సిగ్గుచొప్పున చెప్ప లేక వోటుపోగొట్టుకుందిట! ఆవిడ చర్యలో పౌరుషప్రకటన ఎంతమాత్రం లేకపోడంవల్ల అప్పాగి స్త్రీ సమాజంవారు తమ సభలోంచి ఆవిణ్ణి తొలగించినట్టు తెలుస్తుంది. ఈ ఎన్నికల్లో రెండో విశేషం జమిలి వోట్లు, ముప్పేటవోట్లు, కలిసి వెళ్ళినప్పుడు ఉమ్మడి ప్రచారాలూ, విడివిడిగా వెళ్ళి నప్పుడు జమిలివోటుగాని, ముప్పేటవోటుగాని తనకే ఇమ్మనీ, తక్కిన ఒకడూగాని, ఇద్దరూగాని సున్నే అననీ ప్రచారాలు జరిగినట్టు వదంతులు. సత్యాసత్యాలు తెలిసే వ్యాపారం కాదిది. అసలు వైరిపక్షుల్లో సభ్యులు ఇటువంటి ప్రచారాలు చేశారేమోకూడా తెలియదు. పచ్చరంగూ ఎర్రరంగూ అంటూ వర్ణభేదాలు వచ్చింతరవాతానున్నూ, జమిలివోట్లు వచ్చింతరవాతానున్నూ బయల్దేరిన ప్రమాదం ఇదే. కొన్ని పెట్టెల్లో ఓటుచీట్లేకాక కర్రెన్సీ నోట్లుకూడా దొరికాయని

జనం అనుకున్నారు. మన్యం వేపునించి వచ్చిన ఫైట్లలో తేలుపిల్లలు కనిపించాయిట. వోట్లు మాత్రం లేవట! పరీక్షలు జరిగిన కొన్నాళ్ళకిగాని ఫలితాలు తేల్చడం కష్టం. పరీక్షలు తీసేస్తే బాగా చదువు సాగుతుందని చాలామంది ఉద్దేశం. ఒకవేళ అవి తీసేసినా జీవితపరీక్ష తప్పదు. ఫలితాలు రాకపూర్వం అభ్యర్థులు మార్కులు మదింపులు వేస్తూంటారు. ఇప్పుడంటే మార్కులుకూడా ప్రశ్నల చివర అచ్చుగొట్టి చెప్పేస్తున్నారుగాని కొంచెం కాలంక్రిందట మార్కులనేవి తేలుమంత్రాల్లాగా పరీక్షాధికార్లు తమదగ్గిరే ఉంచుగునేవారు. ఆ మదింపులు చాలా చిత్రంగా ఉంటాయి. ప్రతివాడూ, ఎంత అథముడైనా, సరే, ఆ మదింపులలో నూటికి ౯౦ వచ్చేటట్టు వెయ్యగలడు. "దస్తూరీకి 10 తీసేస్తాడనుకో, ఫలానా ప్రశ్నకి సగం పోతుందనుకో, ఓటడిగితే మరోటి రాశాను గనక ఫలానా ప్రశ్నకి 15 పోతాయనుకో, పేజీ తిరగేస్తే మరి రెండు ప్రశ్నలున్నాయి నేనవి అక్కడ చూడలేదు కనక వాటికి 20 పోతాయనుకో, అయినాసరే నాకు ప్రతీసబ్జెక్టులోనూ హీనపక్షం ౪౫ రావాలి. ఫలితాలు తెలిసిం తరవాత ఆ విద్యార్థి కనిపించడు. ఎందుకంటే వాడికి మార్కులన్ని సబ్జెక్ట్లూ కలిపి ౩౫ వచ్చిఉండవ్. అల్లాగే, ఎన్నికలఅభ్యర్థులు కూడా వోట్లు లెక్కవేసుగుని విజయం మదింపు వేసుగుని ఉంటారు. కాసిఓడటంలేని విజయం ఉండదు. తిట్లు, ధనం,

శ్రమ్మే,– ఎత్తులు జిత్తులు, ప్రతివ్యూహాలూ. నిజాన్ని మించే అబద్ధాలూ వగైరా ఉంటేనేగాని నెగ్గడం ఉండదు; ఓడటం ఉండదు!

## కోతులు

ఎల్లాగైతేం, చివరికి, రాజమండ్రీకి కొన్నికోతులు దిగాయి. ఇవి మన్యపుసరుకా, అద్దరివా, ఉద్ధరివా అనే మీమాంస తేలలేదు. పంకాములు కొత్తగా కాల్పించిన వారు కుమ్మర్లతో కుట్రచేసి, పురపాలక సంఘానికి అర్జీపెట్టు గుని, వార్ని విశ్వాస రాహిత్య తీర్మానంతో బెదిరించి, వారి చేత మరొక జిల్లావార్ని ఒత్తుకుచేయించి వీటిని తెప్పించా రని కింవదంతి. యథార్థం నరుల్లో తేలనప్పుడు వానరుల్లో అసలుకష్టం. అయినా మా స్వకీయుని లేఖరి కొంతకాలంనించి వాటితో పరిచయం ఉన్నవాడవడంవల్ల ఇట్లా రాస్తున్నాడు.

ఇవి కోతులు. అనగా పండుకోతులు. కొంతకాలం కిందట కొన్ని ముచ్చులు కూడా రాజమండ్రీ వచ్చాయి. అవి నల్లకోతులు. ముఖ్యే నల్లవాటికి ఒక ఎర్రకోతి సమా ధానం చెబుతుంది. ఇవీ అవీ కూడా వెనక అద్దరిని ఒకతో టలో ఉండేవి. చుట్టుపక్కల్నించి రోజూ సాయంత్రపు వేళా, సెలవు రోజుల్లో పగలంతానూ, వాళ్ళ సన్నిహిత జ్ఞాతులైన పిల్లలు కొందరు కుక్కలతోకూడా వచ్చి వాటిని

పరామర్శించి పోతూండేవారు. మనిషికీ కోతికీ సంబంధం ఏమంటే జంతుజాలం యొక్క ప్రెసిడెంట్, వైస్‌ప్రెసిడెంట్ సంబంధం. వెళ్ళే పిల్లల్లో కొందరు కొండముచ్చులికి రొట్టి ముక్కలు వగైరా గిరవటేస్తుండేవారు. వాటితో యుద్ధంచేసి ఆముక్కలు ఎవరికీ అందకుండా చేస్తూండేవి కోతులు. కొండ ముచ్చులు జీవించడం దుర్భరం అయింది. ఒకనాడు అవన్నీ అక్కణ్ణించి పోవాలనుకుని ఓపడవ ఎక్కాయి. పడవవాళ్లు బేజారెత్తి దిగిపోయారు. అప్పుడు ఆయిద్దరు పల్లెవాళ్ళనీ ఓపాతిక కోతులు చుట్టేసి పడవ ఎక్కించి, వాళ్లుదర్శించి పడవ పాయ దోసి దాకా ఊరుకోలేదు వాళ్ళు. గ్రహించుకుని ఓపూట శ్రమపడి పడవ నడిపి వాటిని ఈగట్టున దిగవిడిచి పోయారు.

పందుకోతులు ఇదంతా చూస్తూనే ఉన్నాయి. తమరి పని బాగానే ఉందనుకున్నాయి. కాని చుట్టుపక్కల భూస్వాములు వీటిబాధ పడలేక వీటిని కూడా వలలేసి పట్టి రెండు మూడు పడవలు ఇవతలగట్టుకి రవాణాచేశారు. అవి ఈఊరు రాగానే ఈఊరు కుగ్రసమాజపు గౌరవకార్యదర్శికి వర్తమానం మొదట అందింది. అతనుతన సంఘంతోకూడా వెళ్ళి, 'కోతోయ్! నీముక్కు నాముక్కు దురద' అని ప్రతీదాన్నీ ఆహ్వానించేవాడట. అనగా గోక్కోడం అనేది నీకూ నాకూ సామాన్య ధర్మం. మనిద్దరంఒకటే-అని, తక్షణం ఈకుర్రాళ్లు లోగడ అనేకచోట్ల గెల్చిపొందిన అల్లరి 'షీల్డు', వెంటనే

తమ కేల్లా గోసేద్దాం అనా ఏమిటి చెప్మా అనిపించేటట్లు ఆకోతులు ఇళ్ళన్నీ సోదా చేశాయి. వాటిది అపకార్యాహార మతం అవడంచేత కాయలూ పళ్ళూ వాడుకున్నాయి అవి కూడా సంఘజీవులు గనక మనిషి ఒంటరిగా ఎక్కడైనా దొరికినప్పుడు మీదపడతాయి. ఈమధ్య ఒక ఇంగ్లీషు చదివిన ఆయన వాటిని కర్రతో బెదిరిస్తే, అవితిరగబడేసరికి, ఆయన పిరికికండలేని మనిషి గనక చటాల్న ఇంటోకెళ్ళి ఇంగ్లీషులో వాటిని కోప్పడుతూ ఫెడీమని తలుపు వేసుకుని కుర్చీ ముక్కలయేటట్టు కూర్చున్నాడట. ఒక కోంటెపిల్లవాణ్ణి కూడా అవి గీకేశాయట. తమలో కొందరేనా అర్హులైనవాళ్ళు ఉండక పోరు, వారిని ఏదో ఫీజుకి అప్రెంటిస్‌లుగా స్వీకరించి తగిన తరిఫియతు ఇప్పించవలసిందని, కపిసంఘం, మర్కటసంఘ గౌరవాధ్యక్షుడికి అర్జీ పంపినట్లు చాలామంది అనుకుంటున్నారు.

[మాటవరస (6)—1938
రాజమండ్రి
ఆర్ట్సు కాలేజీలో
27—2—1938 తారీఖున
పూర్వ విద్యార్థి సంఘ వార్షికోత్సవ సందర్భములో
అధ్యక్షులైన
శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి సమక్షంలో
చదివిన మాటలు ]

## ౧. భూమి యుద్ధాలు

భూమిమీద యుద్ధాలు జరుగుతూనేఉన్నాయి. యుద్ధం అనేది ఎక్కడా కలికంలోకైనా లేకుండా రూపుమాపాలనే ఆదుర్దాలో గొప్ప జాతులవాళ్ళు యథాశక్తిగా వీలైనన్ని ఆయుధాలు తయారు చేసుగుంటున్నారు. యుద్ధాల్లో ప్రాచ్య యుద్ధాలూ, అప్రాచ్యయుద్ధాలూ కూడా లేకపోలేదు. ఆంగ్లేయులు ప్రతీచోటా గోడమీద పిల్లివాటంగా ఉంటారని వదంతి. అదిగాక వారిలో వృద్ధజంబుకతుల్యులుగా ఉండే రాజ్యాంగ వేత్తలు చాలామంది ఉన్నారని పుకారు. అతి మధురంగా ఉండి ఇవతలవాణ్ణి బుటక వేయించే సమర్థింపు సమాధానాలు చెప్పడానికి వాళ్ళకిక సాటిలేరు. ఇటీవల అబిస్సీనియా, స్పెయిన్, చీనా దేశాల్లో గదా యుద్ధాలు జరిగింది! వాటిని ఇంగ్లీషువారు ఎట్లా సమర్థించారో చూడండి.

'ఎబిస్' అంటే ఇంగ్లీషులో అఖాతం అనే అర్థం ఉండడం చేతనున్నూ, తమరి కవి అయివున్న డాక్టర్ జాన్‌సన్‌గారు పూర్వకాలంలో 'రాసిలస్' అనే గ్రంథంలో ఆబిస్సీనియా వారిని గాలిలోంచి దిగి ఎవరో తంతారని జోశ్యం చెప్పి ఉండడం చేతనున్నూ ఆబిస్సీనియా పోయింది. మనం ఏంజేస్తాం అన్నారు. ఇక, స్పెయిన్ అనేమాటలలో 'పెయిన్' అనగా, బాధ రాసిపెట్టి ఉండడంవల్ల స్పెయిన్ దేశం బాధల్లో పడిపోయింది, ఎవరేం చెయ్యగల్రు పొమ్మన్నారు, మరి చీనా అంటే ఇంగ్లీషులో పింగాణీకి యాథ్యర్థం అవడం వల్ల ఆ దేశం ముక్కముక్కలు అయిపోతోంది. దేవుడు దిగొచ్చినా ఆముక్కలు అతుకోవు, ఊరుకోండి అని అన్వయించి చెప్పేశారు. [ ఈరచన కొన్నాళ్ళకి జర్మనీవారు ఆస్ట్రియాని ఆపోశనం పట్టారు. ఇదివరదాకా మింగుడుపడే దేశాలయొక్క ప్రారబ్ధం గురించి వాపోయే ఇంగ్లీషువారు ఈమాటు మింగే దేశంయొక్క మహిమనే సమర్థించారు. 'జర్మ్' అంటే ఇంగ్లీషులో పురుగు గనక, జర్మనీవారు తమచుట్టు పక్కదేశాల్ని (అనగా, లోగడ రైన్‌లాండు నేడు ఆస్ట్రియా, రేపు సుముహూర్తం రాగానే జెకోస్లోవేకియా వగైరాలు) వేటినైనా సరే పురుగుపట్టినట్టు పట్టికొట్టేస్తారు. మనం కళ్ళప్పగించి చూస్తున్నా సరే, లేక ఒకవేళ దైవాద్యాకళ్ళు నొప్పెట్టిన పక్షానికి మూసుగున్నా సరే నామర్దాగాని ప్రత్యవాయువుగాని లేదని రాసిస్తాం

అన్నారు. ] కాని యుద్ధాల్ని అరికట్టడానికి నానా
జాతిసమితి భూమిమీద కల్లా ఉత్కృష్టమైన సంఘం అని
కొందరి ఊహ. అది ఉండబట్టే భూమిమీద ప్రజ ఇప్పటి
లాగ ఏదో ఒకమాదిరిగా సేనా మన్నగలుగుతున్నారనయితే
కదూ, అని వారనేది. ఇతరులు; అసలు ఈ నానాజాతిసమిం
వల్లే యుద్ధాలు ఎక్కువయినాయి, బహుశా ఆసమితికి తగని
పని కలిపించడానికే యుద్ధాలు మరీ చెప్పినమాట వినకొచ్చి,
వెనకటికంటె విస్తారంగానూ పొగరుమోతురకంగానూ అవు
తున్నాయని అంటారు. కొందరు; జాతులన్నీ శక్తివంతం
అవుతున్నాయి. అంతకంటెఎక్కువశక్తిఉంటేనేగాని జాతుల్ని
అంతుపెట్టగలశక్తా సమితికి ఉండదు. జాతులికి చతురంగ
బలం ఉంటూన్నప్పుడు, వీళ్ళని అదుపాజ్ఞల్లో ఉంచడానికి,
జాతిసమితివారికి రెట్టికి రెట్టుగా అష్టాంగబలం గాని, తప్పి
జారితే పంచాంగబలంగాని ఉండాలి! జాతులకి విషవాయు
బలం ఉంటే జాతిసమితివారికి విషాకాశబలం ఉండాలి! అటు
వంటి సాధనాలు ఈ సమితికి చేకూరడం అసంభవం అయి
సమితివారు జాతులకి తత్వోపదేశం చెయ్యడం బరిమీదపడి
దోచుకుపోయే కాడీమీద పళ్ళూడిన బామ్మగారి తొస్సిబెది
రింపులా ఉంటుందని, నమ్ముతారు. మనస్సులో ఊహ మం
చిదైనా దండించే త్రాణతక్కువైనప్పుడు న్యాయప్రతిపాదన
కల్లవార్త. అందుకని, వీరికి కాస్తంత అప్పీలుగా ఒక చిన్న
నానాగ్రహసమితి ఏర్పాటయితే యుద్ధం అనేమాట లేకుండా

చెయ్యొచ్చునని న్యాయప్రియులు పలుకుతూన్నారు. సమితిలో గ్రహాల్ని చేర్చడం మనం అనుకునేటంత కష్టం కాదని వీరి వాదన! ముందు చంద్రుడు. చంద్రుడిదగ్గరికి 49 గంటల 24 నిమిషాల్లో వెళ్లొచ్చుట. వెళ్లి అక్కడ ఒక పార్లమెంటు స్థాపించవచ్చుట. అదివరకే అక్కడ ఏదేనా కాఫీహోటలు గాని ఉన్నట్టాయినా దాన్ని పార్లమెంటుగా ఒప్పించవచ్చుట తీరామోసి అదే మిలిటరీహోటల్ అయితే అదే పార్లమెంటుగా ఒప్పుగోవచ్చుట. ఇల్లానే, అంగారకుడుదగ్గిరికి వారంరోజుల్లో క్షేమంగా జేరవచ్చుననిన్నీ అక్కడ నీరు ముప్పాతికమువ్వీసమున్నూ నేల పాతికవీసమున్నూ అవడంచేత అంగారకజనం భూమిజనంకంటె అధమం నాలుగురెట్లు శారీరకంగా బుద్ధిమంతులూ అయిఉంటారుగనక అంగారకుణ్ణి గ్రహసమితిలో చులాగ్గా చేర్పించవచ్చుననిన్నీ, శుక్రుడికి ఒక కన్ను లేకపోవడంచేత అతణ్ణి ఒకపక్షానికి లాక్కోవచ్చుననిన్నీ సూర్యుడు దూరానికి దుర్నిరీక్ష్యుడుగాని దగ్గిర కెడితే మనమాస్టరే అనిన్నీ, బుధుడు సూర్యుడికి కేవలం తెలివిగలసత్తారకాయి గనక వాడివిషయం అట్టే యిబ్బంది ఉండదనిన్నీ, గురుడు శుద్ధమేష్టరున్నూ వట్టినాయనా గనక పెండికట్లూ అతనూ మన్ని చూసేసరికే పాడిలి మనపక్షం చేరతాడనిన్నీ. సెలవిచ్చారు. ఇక ఒక్క శనిమాత్రం మిగిలిపోతాడు, వాడు కొంచెం పేచీలుపెట్టి సమితిలో చేరడేమో, 'వీ డెక్కడో శనిలాగ పోగయ్యాడురా మరీనూ' అని వాణ్ణి శని విరగడచేసు

గున్నైనా సరే, భూమిమీద మరి యుద్ధం అనేది రాకుండా కట్టుదిట్టం చేస్తారని జ్ఞానులు ఊహిస్తున్నారు. ఇన్నిగ్రహాల యొక్క కూటమి జరిగినప్పుడు భూమి అనేదే ఐపూ ఆనవాలూ లేకుండా పోతుంది గనక అప్పుడు జరిగే భూమి యుద్ధాలు సమేతూ దృష్టికి అందవు కాబట్టి వాటిని అసలే జరగని వాటికింద కట్టుకోవచ్చు. ఆక్షేపణ లేదు. అని దైవజ్ఞులు కూడా పైమాట ఖాయపరుస్తున్నారు. ఆగ్రహసమితిలో ఉండతగ్గ భూప్రతినిధి ఏజాతి, ఏమత., ఏభాష వాడు అయి ఉండాలో (పాతరాజులు తోసిరాజు లయారు గనక) నిరంకుశ రాజుల దగ్గిర్నించి సిఫారసులు తీసుకుని సిద్ధంచేసి ఉంచడానికి ఒక ముక్తసరుకమిషను ఏర్పాటు చేస్తున్నారు, ఈకమీషనులో ఎవరెవరు ఉండాలి అనేదాన్ని గురించి ప్రస్తుతం దారుణం అయిన వాదోపవాదం జరుగుతోంది.

## ౨. మంత్రివర్గం

ఎవరిపని మీద వారుంటారు. కాంగ్రెసు మంత్రులు ప్రతిరోజూ ఉదయాన్ని టెలిఫోనులో, ''నేను ఈరోజు మంత్రి నేనా'' తమ పైవార్ని పిల్చి కనుక్కుని, ఆతరవాత నే కాగితాలు చూస్తూంటారని వింటాం. ఈమధ్య బీహారు మంత్రుల రాజీనామా, వెనకటి భూకంపంలాగే వినబడింది. దాని దెబ్బ మద్రాసుకి కూడా తగుల్తుందా అని కొందరికి ఊహకలిగింది.

ఆసందర్భంలో తమరికి మంత్రిత్వం దొరుకుతుం దేమోనని కొందరు జాతకాలు పట్టిగెల్లి జ్యోతిష్కులికి చూపించారు. వాళ్ళు కాదేమో అని చెప్పగా వాళ్లని కొట్టి వాళ్ళచేత అవచ్చు అనిపించుకున్నారు. కొందరు ఫోటో, టీపార్టీ, ప్రాణాపాయం లేకుండా అవుట్లతో ఊరేగింపూ ఏర్పాటు చేసి, లోపాయి కారిగా బజానాలు పారేసి ఒకవేళ తమకే మంత్రిత్వం గనక వస్తే ఏమేమి చెయ్యదల్చుకోవాలో దాని తాలూకు డ్రెస్ రిహార్సల్ వేసుకున్నారు. మేష్టర్లకి భయం పట్టుకుంది. ఈమధ్య కోట్లు అక్కర్లేదు మామూలుగా మనిషి వెళ్ళి పాఠం చెప్పినా తెలుస్తుంది, ఒకడు వేషం వేసుకుంటే ఇంకోడికి గౌరవాగౌరవాలు హెచ్చనూ హెచ్చవ్ తగ్గనూ తగ్గవ్, అని పై వారు ఒప్పుకున్నారు. అంచేత డబ్బులేని మేష్టర్లు కూడా కోట్లాదిగా దానం చెయ్యడానికి తరుణం వచ్చింది. కాంగ్రెసు మంత్రివర్గం పోతుందేమో అని అనుమానం రాగానే మళ్ళీ ఆదానం చేసిన కోట్లు ఎవళ్ళకిచ్చేశారో కనుక్కుని వాళ్ళకి స్వరూపానికి ఇంత చొప్పున ఇస్తాం అని చెప్పి వాళ్లు అవి లోగడ తొడుక్కున్నా, మరి ముందు తొడుక్కోవద్దు కేటాయింపుగా తమరు చెప్పేవరకూ ఉంచమన్నారట. ఈలోపుగా వైస్రాయిగారు ఋణనివారణ అంగీకరిస్తారా లేదా, మద్రాసుకి, అన్నప్పుడు మరీ భయం చాలామందికి వేసింది. ఇప్పుడిప్పుడు కొంచెం సర్దుకొంటున్నారు.

[14]

## 3. రైలు - బస్సు

రైలు రాక్షస వాహనం అని శ్రోత్రియుల నమ్మకం! అందుచేతనే అందులో వేసేబొగ్గుని 'రాక్షసి బొగ్గు' అంటారని వారివాదం. బస్సుకూడా యమ వాహనం అయిన దున్నయొక్క కోవకి చెందిన ఇనపజాతి అవడంవల్ల, రైలుకీ బస్సుకీ ఎప్పుడూ సవితిపోరే. బస్సు గర్వం ఏమనంటే, తను గడప గడపకీ కూడా వెళ్ళగలనని! రైలు, అల్లా ఆ బిగించినపట్టాల మీదేగాని, అవి దాటి ఇవతల కాలెట్టలేదు. ఆపట్టాల గొడవ కాస్తా వొదిలిపోతే, ఎక్కడికి బడితే అక్కడికి రైళ్లు కూడా వేంచేసి బస్సుని పాతిపెట్టేసి ఉండేవి. రైలువాడికి ఈ విషయమైన దుగ్ధపట్టుగుని బస్సులాంటి రైలుకారు వేశాడు; అడ్డమైనచోటా ఆగడంసాగించాడు, తంటాలుపడుతున్నాడు. గాని పట్టులు విసర్జించడానికి వీల్లేకొచ్చి ఇదవుతున్నాడు. బస్సువాళ్ళు బస్సుని పొడిగించి క్రమేపీ యాభైమందికీ వందమందికీ, ప్రయాణకాలంలోకూడా శుభాశుభాలకి అక్కరకొచ్చేరకంవి చెయిస్తారట. వీరిపోటీల్లో, ఉభయులూ రేట్లు తగ్గించుగోడం జరిగింది. కానైతే, ఎక్కినవాళ్ళకి, ఇంకా అరటిపళ్ళూగట్రాఎదురివ్వడం దాకా రాలేదు. ఇల్లాగ్గా రైలువారూ బస్సువారూ అన్యోన్య వైషమ్యాలున్నవాళ్లైనా, జనానికి పుణ్యం ఆర్జించుగునేమార్గాలు చూపెట్టడంలో సమానులు. రైలువాళ్ళు స్త్రీలనీ అంధుల్నీ చర్మరోగుల్నీ వికలాంగుల్నీ ఉచితంగా పంపించి, ప్రయాణీకులు స్వల్పదానం

తో పశశరీరంగా తిరించేతరుణం కల్పించి పెడుతున్నారు. రైలులో సీజనుటిక్కెట్టుతో యాచించేవాళ్ళూ, రైలు ముష్టితో వడ్డీవ్యాపారాలుచేసేవాళ్ళూఉన్నారు. నేను వాళ్ళతో ప్రసంగించాను. బస్సువారుకూడా సబురుఒకటికి తలఒకటికీ ఒక కాని చొప్పున బలవంతంగా వసూలుచేసి, వద్దన్నా పుణ్యంప్రయాణీకులకి కట్టబెట్టదలచి, వాళ్ల శరీరాలు బస్సుల్లో బంధింపబడ్డావాళ్ళఆత్మలకి ముమ్ముందు శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తి సిద్ధించేలాగు, ఆడబ్బుపెట్టి శ్రీరామనవమికి పందిళ్ళు కన్నుల వైకుంఠంగా వేయించి, అక్కడ మళ్ళీ జ్ఞానమూ మతమూ సత్తూ చిత్తూ అంటూ కూచోక అరితేరినవాళ్ళు అవి తమ చేతనే లోగడ 'క్యార్టు' పొంది శరీర సౌరభమూ నృత్యకౌశలమూగల కళాసభుల్ని పురమాయించి, ఇహంపేమిటి పరమే గాని అని అదివరలో కబుర్లుచెబుతోచ్చిన వేదాంతులుకూడా పొడిఅన్నం తిని, వెళ్లి, ప్రొద్దుకూకకుండానే మేళంపందిట్లో హాజరయేటట్టు చేసి, సూక్ష్మంలో మోక్షం కరతలామలకం చేస్తున్నారు. రోడ్డు సుష్టుగా లేదని తెలిసీ కూడా కార్లనీ బస్సుల్నీ మనోవేగంతో పోనిచ్చే పాలకసంఘంతో పాటు బస్సు యజమానికీ చోదకుడికీకూడా, దానిగమనంవల్ల రేగిన దుమ్మువల్ల పుట్టే వ్యాధుల బాధ్యతలో వాటా ఉండి తీరుతుంది. అంతకంటె ఎక్కువది బస్సువారు ప్రజకి చేసే మేలు మరొకటి ఉంది. బస్తీలో గేదెలు అరుదు. పల్లెల్లో గేదెల్ని చెరువుల్లో కడుగుతారు. అవి అప్పుడే నీళ్ళు ఆరగిస్తాయి.

కాని, చెరువుబురదం అట్టేసేపు ఉంచవు. బస్తీలో బస్సుల్ని కుళాయిలదగ్గిర కడుగుతారు. బస్సురోజుకి అధమం-తన్నైతేం ఇతరులు తోయ్యడం వల్లనైతేం- యాభైమైళ్ళు నడుస్తుంది, సాధారణంగా రోడ్డుమీద నడుస్తుంది. కాని చాలా గ్రామాల్లో బాహ్యస్థలంగా ప్రయోగపడే రోడ్లపక్కల్ని కూడా తప్పగోవలసొచ్చినప్పుడూ అప్పుడూ- నడుస్తూంటుంది. అది తిరిగి బస్తీచేసేసరికి దానికి అడుగున ఉండే చక్రాదిసామగ్రికి ఓపాతిగ చదరపుఅడుగుల మేర ఓ అంగుళం దళసర్ని కాటిగలాంటి కంకర లేహాం మాంచిపాకంలాగ పట్టుగునిఉంటుంది. మళ్ళీసబురు మర్నాడు బయలుదేరేలోపల దాన్ని శుభ్రపరచడానికి-అనగా, అనేకస్థలాలకి అది స్వయంగా వెళ్ళిఅక్కడ ఆర్జించుగుని పట్టుగొచ్చిన మాహాత్యాలఫలితం అయిన గంధద్రవ్యాన్ని పోగొట్టడానికి- దాన్ని కుళాయిదగ్గిరికి తోల్తారు. ఒక్కొక్కప్పుడు డ్రైవరు చక్రహస్తుడై కూర్చుని, తనముంజుట్టులో మొహం దాక్కోగా, కుళాయినీళ్ల కొచ్చిన అమ్మలక్కలగోలస్మృతిచేసుగుని 'వస్తాడే'లాంటి కాలసరికీర్తనపాడుతూంటాడు. క్లీనరు అడుగున దూరి బస్సుని తోమి కడుగుతూంటాడు. క్లీనర్ని కూడా కుళాయిదగ్గిర కడగితే, ఇక ఆశే లేదు. భూదేవి ఎంత మార్దవంగా ఉండగలదో నీళ్ళకొచ్చిన వాళ్ళకి తెలుస్తుంది, వాయువు ఎంతసుగంధంవహించగలదో ఆవీధివాళ్ళకి తెలుస్తుంది. బీడీపొగపైకి వస్తూన్నా ఒకొక్క గంటకేనా ఆక్లీనరు పెబ్లగిలి బయటికి రాడు. బస్సుకి ఈ

తలంటు—తలంటు అనేమాట అతక్క పోతే 'చక్రంటు' అనాలి—పూర్తి అయేసరికి, తను కానిచోట్లన్నీ తిరిగి విశేష శ్రమపడి శాస్త్రకాస్త చెప్పనే వెల్లించి తెచ్చిన పదార్థం యావత్తూ ఆ కుళాయి ప్రాంతం యొక్క పగం అయిపోగా, బస్సు 'మూకారా, నాత్యాగం!' అన్నట్లు నీరసంగా ఊరుకుంటుంది. కొన్ని బస్సులు మంచి రకంవి కాకపోవడంచేత రాలవలసిన పరిమాణంలో దుమ్ము బురద ప్రతీ ఒక కుళాయి దగ్గిరా రాలకపోతుందేమో అనే దిగులు చెప్పన, ఒకే కుళాయిదగ్గిర నాలుగేసింటినికూడా రోజాకిక దుత్తూడడం కద్దు. నగరపారిశుద్ధ్యం ఇందుమూలాన్ని దళసరి అవుతుందని ఒప్పుకోని వాళ్ళు మందకొడిగా ఆలోచిస్తున్నారని చెప్పాలి.

## ఒ వా ర్త

తగుదుంఅనితమరువందలాదిగా జీతాలుపుచ్చుకుంటూ పెద్దలం మళ్ళీ మాట్లాడితే దారి నూపెట్టేవాళ్లం అని పేరు పెట్టుగుని, ఈమధ్య నలుగురు గొప్పవాళ్ళు, ఒక యావత్తు సంసారాన్నీ చటుక్కున లాక్కెళ్ళి తయారీ లేకుండా నోటీసు లేకుండా భర్తనీ భార్యనీ పిల్లల్నీ, పాపంకాని పుణ్యంగాని మరోటిగాని ఎరగని వాళ్ళని అమాంతంగా షూట్ చేసి, చక్కాపోయారట. మర్నాడు ఆసంసారం వాళ్ళు తమకు పట్టిన పదవికి సంతోషించి, జనానికి టీపార్టీ ఇచ్చారట. చచ్చినవాళ్ళు మళ్ళీ ఎల్లాబతికారా అని ఈవార్త విన్నవాళ్ళు

కొందరు బాధపడగా, "ఓరి మీయిల్లు బంగారంగానూ, ఆ సంసారం వాళ్ళు చావలేదర్రా. వాళ్ళని 'షూట్' చేసింది ఒక సుప్రసిద్ధ ఫిల్ము కంపెనీవారు రా బాబూ! టాకీలలోకి వెళ్ళడానికి సజీవులైనవాళ్ళు ఎవళ్ళైనా సరిపోతారర్రా! తక్కిన వాళ్ళు కూడా పనికొస్తారు గాని స్థాపన, దహన, ఉద్బంధన క్రియల ధర్మనూ అని, ఆరకం దొరకరర్రా! అని గ్రహించు గున్న వాళ్ళు తెలియచెప్పారట!

౫ కల

ఒక ఊళ్ళో ఒక విద్యార్థికి ఈమధ్య ఒకనాటి రాత్రి కలొచ్చిందిట. అందులో తనకి ప్రస్తుతం పాఠాలు చెబుతూన్న మేష్టర్లంతా ఒకేసారి గతించిపోయినట్లు అనిపించిందట. ఆసంగతి అతడు తన ముఖ్యస్నేహితుడితో ఒట్టెట్టించుకుని చెప్పాడు. వాడెళ్ళి మార్కులకోసం ఒక మేష్టరుతో ఊరాస్త ఊదాడు. ఆ మేష్టరు మొదటికుర్రాణ్ణి పిల్చి, 'ఏమోయ్, నేను పోయానుఅన్నావుటగా!' అడిగాడు. 'నేను అల్లా ధన్నే అన్లేదండి' అని కుర్రాడు మొరాయించాడు. 'పైగా, అబద్ధాలోటా!' అని కుర్రాణ్ణి మేష్టరు గదమాయించాడు. 'నేను మొత్తంమీద చెప్పినప్పుడు మిమ్మల్ని ఒక్కర్నే అన్నట్టు మీరు దేవుళ్ళాడ్డం ఎందుకు!' అని కుర్రాడు అన్నాడు. వతనగా సంగతులు మోసే జనం అధికార్లకి ఈ జట్టీసంగతి మోసేశారు. ఆ మేష్టరు సజీవుడా నిర్జీ

వృథా అనే సంగతి తేల్చడానికి ఒక ఉపసంఘాన్ని వారు ఏర్పాటుచేశారు. మేష్టరు సంఘసభ్యుల్ని యథాశక్తిగా, వీలైతే వాళ్ళ ఇళ్ళకి కూడా వెళ్ళి దర్శించి ఆశ్రయించి, తను బతికున్నట్టే వారు తీర్మానించేలాగు చూసు కున్నాడు. ఈ సంగతి ఊరంతా పనగలిసిపోయింది. విద్యార్థులంతా ఆగ్రహించి, ఒక మేష్టరు మాత్రుడు తమసాటి విద్యార్థిని అనవసరంగా తూలనాడీ కూడా క్షమాపణ వేడుకోని కారణంచేత తమరికి పాఠాలమీదా, సెలవురోజులమీదా, మేష్టర్ల మీదా అసహ్యం పుట్టి, సమ్మెకట్టుకట్టి రైల్లో వెళ్ళిపోయారు. చాలా గందరగోళంగా ఉంది. ఈ సంగతి పైకి తంతికొట్టి, శ్రీగిరిగారిని అక్కడికి రప్పిస్తారనిన్నీ, రాజీ కుదరవచ్చు ననిన్నీ అనుకుంటున్నారు.

స్వంతభాషలు. కలికి సంగతి ముందు తేలవలసింది గనక, కలికికి తెలుగు వస్తుందనుకోడానికి వీల్లేదు. సనకసనందనాది మునిసంతతికి పరాపశ్యంతు లేట. తెలుగువాళ్లే పూర్వమత కర్తలైన శంకర, రామానుజ మధ్వులది ఆంధ్రేతర భాషలే. నేటికాలంలో కొన్నికొన్ని తెలుగుపాటలు, గ్రామాల్లో నవీనమత కర్తలుగా ఎంచబడే రామకృష్ణ రఘోస్వామి, అరవింద్, సాయిబాబావంటివాళ్ళది తెలుగు కాదు; వాళ్లకి తెలుగు రాదు. తెలుగులో 'చనినా రాద్యాను చక్రవర్తులు' గదా అంటే వాళ్ళల్లో ఎవరూ తెలుగులో పుట్టలేదు. తెలుగు కవనం చెప్పిన కృష్ణరాయుల వంటివాడికి వచ్చిన భాషలు గమనిస్తే అతడి మాతృభాష తెలుగే అని చెప్పడం కష్టం. తెలుగు వాళ్ల రాజుల్లోనూ రాజ్యాల్లోనూ చాలామంది తెలుగుని పోషించినా, దూరసంబంధ బాంధవ్యాలు కలవాళ్ళవడంచేత వాళ్ళల్లో పలువురికి తెలుగు రాదు; వచ్చినా లిపి తెలియదు; తెలిసినా అన్వయం చిక్కదు. తెలుగూ వచ్చి తెలుగు పోషణా చేసినవాళ్ళు గుడుగుడుగుంచంలో పడ్డారు. నేటికి గొప్పతెలుగువాళ్ళు తెలుగువచ్చినా వాడరు. తెలుగు వాడకుండా ఉంటేగాని తెలుగువాళ్లచేత గొప్పవాళ్ళనిపించుకో లేరు. తెలుగుదేశం విడిచి అన్యత్రా వెళ్లిన తెలుగువ్యక్తి యొక్క గొప్పతనంగాని తెలుగువాళ్ళకిఅస్తాందను. దీనినిబట్టి చూడగా ఆరాధించడానికీ, పూజించడానికీ, మెచ్చడానికీ, నమస్కరించడానికీ, దాసోహంచేయడానికీ, శిరసావహించ

దానికీ, విశ్వసించడానికీ, ఆంతర్యం ఇవ్వడానికీ, అవతలవాళ్ళు – దేవుళ్ళు, చిల్లర దేవుళ్లు, ఋషులు, చిల్లర ఋషులు, మహర్షులు, చిల్లర మహర్షులు, పాలకులు, చిల్లర పాలకులు, యావద్విశిష్టులూ తెలుగుప్రమేయం లేని వాళ్ళయితే తప్ప తెలుగుజాతికి ముందున్న స్తంభిత పడదుగావును, హృదయం తృప్తిపడదుగావును అని తేలుతుంది. పై చెప్పిన మధ్యవర్తుల్లో ఎవరు తెలుగు బాధ అవగాహన చేసుకుని పెద్ద దేవుడికి తమర్ని సిఫార్సు చేస్తారనో తెలుగువాళ్ళ ఉద్దేశం! తెలుగు తల్లిమది పై మధ్యవర్తుల ముఖతా పెద్దదేవుడు తెలుగుభాష ఇంతవరకు ఒక్కమారైనా విన్నవుంటాడా అని! ఔరా! చిత్రమవుతుంది. లోగడ ఎప్పుడైనా తెలుగు రవ్వంత విని ఉండకపోతే పెద్దదేవుడికి ముందుముందు మన తేనె తెలుగు తెలుస్తుందో ఇంజెక్షన్ ఇవ్వాలో! అదిసరి, కీడెంచి మేలెంచమన్నారు — అసలు ఆ పెద్దదేవుడికి తెలుగువచ్చునో. లేకపోతే తగిన తెలుగువాళ్ళల్లో ఆయన్ని మొదట తెలుగుబళ్ళో పడేసి అధమం ఏ 'బేసిక్' తెలుగో సృష్టించి నేర్పి తరవాత తెలుగులో అతడితో వ్యవహరించాలో! ఏమో! తెలుగుగురించి పెద్ద దేవుడికి ఇంకా ఏం పాట్లు రాశాయో ఎవడెరుగును!

౭. ఒక తెలుగువాళ్ళ ఇడెన్ పార్టీలో ఇడెన్ యొక్క ప్రథమసృష్టికర్తలు అరవలా, ఆంధ్రులా అనే మీమాంస వచ్చింది. మూడువందల ఏళ్ళకిందటినించీ ఆ పేరు తెలుగులో ఉండని ఒక ఆంధ్రుడు ప్రమాణాలిచ్చాడు. కాని వస్తువ్యయం లేకుండా, సవిశేషంగా ఇడెన్ చెయ్యడంలోని

నేర్పా, ఇడెన్‌కీ సాంబార్‌కీ ఉండే అన్యోన్యస్వరసాయనిక మైత్రి ఆవిష్కరించడంలోని సూక్ష్మబుద్ధి కనపరచినవాళ్లు అరవలేగనక అరవంలోంచే 'ఇడెన్' తెలుగులోకి వచ్చి ఉంటుందని ఇంకో ఆయన అన్నాడు. వయినం తెమల్లేదు. వాళ్ళిద్దరూ కేకలేసుగుని, తిట్టుగుని జుట్లు పుచ్చుగుని కొట్టుకున్నారు. తక్కినవాళ్ళు యథాశక్తి చొప్పున ఏమీ చెయ్యలేక నోరు తెరచి మధ్యనుంచున్నారు. తరవాత ఒక ఉన్న పార్లమెంటరీవాదన పూర్వలిఖితం చేసి అటు ఇలా, ఒడుదుడుకు లేకుండా, కానిచ్చారు. అయినా కేసు పైసలు కాలేదు. ఆఖరికి, పోనీ గొప్పవాడు గదా, నేడో రేపో వృద్ధిలోకి రాబోతున్నాడు ఆ మాత్రం తెలియకుండా ఉంటాడా అనుకుని, లండన్‌లో మంత్రిగా వున్న సర్ యాంటోని ఇడెన్ గారికి రాసి ఈ సంగతి స్థిరపరచడానికి ఒప్పుగున్నారు. ఉభయపక్షాలకీ జయకరమై సరియైన జవాబు ఆయన ఇవ్వకపోతే వెంటనే ఎంత ఖర్చైనాసరే ఈ విషయం యూడామేకీ, ఈనకీ అప్పీలు చేస్తారని అనుకుంటున్నారు. కొన్ని కొన్ని విషయాల్లో ఆంధ్రులకి మా చెడ్డ పట్టుదల!

౬. ఈ మధ్య ఒక ముఖ్యపట్టణంలో నటనక్షత్రాల్నీ, రంగతారల్నీ పోగుచేసి సంగీతనాటకం ఆడిస్తానని ఒకడు పూచీపడి శపథం చేశాడు. మొత్తం రు. 1600 నక్షత్రాలకి ఇవ్వడానికి ఒప్పుగుని ఉత్తరప్రత్యుత్తరాలు నడిపి, 15 రోజుల పూర్వం నించీ టిక్కెట్లు అమ్మించాడు. ప్రదర్శనం తేదీనాటికి ఏనిమిది వందల రూపాయలు టిక్కెట్లు అమ్మకంవల్ల వచ్చినట్టూ, నక్షత్రాలకి సొమ్ము పూర్తిగా పంపక పోవడంవల్ల

నగరంలో కొంత ఇన్‌స్పెక్షన్ తగ్గిదనిన్నీ, అల్లాంటివి దేశోపకారమే అనిన్నీ ఆ సందర్భంలో టికెట్ కొనకపోయినవాళ్ళంతా ఏకగ్రీవంగా తీర్మానించారు.

1. ఆంధ్రులకి 'ఆదర్శం' 'పూర్ణం' అంటే ఇష్టం. ఏదైనాసరే, ఉంటే ఎల్లా ఉండాలి అంటే ఆదర్శప్రాయంగా పరిపూర్ణంగా ఉండాలి. లేకపోతే అసలు ఉండకూడదు. పని ఏదైనా చేస్తే, ఎల్లా చెయ్యాలి? ఆదర్శంగా చెయ్యాలి (అనగా ఏమిటేమిటో ఎవరూ, తనూ కూడా చెప్పడానికి వీల్లేనంత మహా ఇదిగా చెయ్యాలి) లేకపోతే! లేకపోతే పని మానేసి, నోరుమూసుకుని వాజమ్మలా కూచోవాలి. సర్వసాధారణంగా ఈ రెండో మార్గం జరుగుతూ ఉంటుంది. అనగా శూన్యం! ఇదే ఆకాశం. అందుకనే గావును నేటి అధ్యక్షులైన తెలుగు అధికారి పృథివ్యాపస్తేజో వాయురాకాశాల లబ్ధిగురించి ఆలోచించి తెలుగుజాతికి ఆకాశపదార్థం సహజ సమృద్ధిలో ఉండడంవల్ల మరి గట్టి చెయ్యవలసిన అవసరం లేదని గ్రహించుకుని, పృథివ్యాపస్సులు ఇప్పించడానికి చేయిస్తూ తేజోవాయువులు వాడుకోడానికి సలహాలు ఇస్తూ ఉన్నారు. భూతపంచకాన్నీ, ఆంధ్రజాతిని వీరు చాతుర్యంగా శోధించారు. 'శాంతి శోధిస్తుంది' అని శాస్త్రంగదా!

5. ఒక అబ్బాయికి జబ్బుచేసి, కాల్చే కాల్చే చుట్టంటే రోకు పుట్టింది. ఆజబ్బులో చుట్ట ముట్టేవాడు కాడు. మళ్ళీ అతడు చుట్ట కాల్చగలగడం అనేది రోగం మళ్ళిందనుకోడానికి సూచనగదా అనిగావును, వాళ్ళనాన్న "మా వాడు మళ్ళీ హాయిగా ఎప్పుడూ చుట్ట కాల్చుకుంటాడోగదా" అంటూ బెం

గెట్టుగు నేవాడు. అల్లాగే మేం చిరకాలం ఆంధ్రపేపరుమిల్లు గొట్టం కేసి చూస్తూ "ఈమూల ఎప్పుడు ఆడ్డి ఈ గొట్టంలోంచి ఎప్పుడు పొగ వస్తుందో కదా!" అని బెంగెట్టుగున్నాం! కొంత కాలానికి దాన్ని నిర్వహించడానికి ఆంధ్రేతరులు వచ్చిన తరవాత అంతపనీ జరిగింది. ఆంధ్రంలో పని జరగడానికి ఉండవలసిన ఒక లోటూ పూడింది, మరి లక్షణాలు లేకుండా జోరు నడుస్తుంది అనుకున్నాం! కాని అంతట్లోనే మళ్ళీ ఆగిపోయి ఊరుకుంది. ఒకే ఫైడుంటుంది. తెలుగుగడ్డమీదికి బంగాలీ మరాఠీ గుజరాతీవాటి ఏ ఆంధ్రేతరుడొచ్చినా కూడా పని ఇంతేగావును నిస్సందేహంగా ఆస్థలంలో ఏదో మహాత్మ్యం ఉంది. లక్ష్మణుడు రాముడిమీద కోపం తేసి తిట్టాడని గాథ చెప్పేస్థలం ఇదే అనో. దీనికి చాలా దగ్గరనో ఏదేనా శాసనం దొరకుతుం దేమో అనేటంతగా వచ్చింది. వ్యవహారం!

(6) ఈ రాజమండ్రి కాలేజీ పూర్వవిద్యార్థిసంఘంలో చాలామంది వృద్ధపురుషులు ఉన్నారనే విచారమేమీ లేకుండా, చిరకాలంనించి ఓల్డుబోయిస్ ఎసోసియేషన్ అని ఉంటూండే పేరుపోగొట్టి ఆసంఘానికి ఓల్డ్ స్టూడెంట్స్ ఎసోసియేషన్ అనే మారుపేరు పెట్టించడానికి తగిన కారణభూతులైన సోదరీమణులు విద్యానంతరం ఆంధ్రగృహాభ్యుదయానికే కాక, ఆంధ్ర దేశాభివృద్ధికికూడా తోడ్పడగలందులకు తీర్మానించుకున్నారని తెలుస్తుంది.

(7) పురపాలకవర్గాల్ని చూస్తే ముచ్చటేసిపోతుంది. తమకి డబ్బుముట్టిచేసిన మహామనుషులకే తమఓటు అనబడే మానవభాగ్యాన్ని అమ్ముకుని, పురమహాజనం పాలకవర్గసభ్యుల్ని

సృష్టించుకుంటారు. విశేష వ్యయంలో అటువంటి గౌరవ సభ్యత్వం ఆర్జించిన పాలకసభ్యులు స్వంత పెట్టుబడిని గడించి పోవాలనిన్నీ, నిష్కామకర్మనాశ్రమే చేస్తూ నిరంతరం జనసేవ సాగిస్తూ ఉండాలనిన్నీ పురజన సౌభాగ్య తరవాత కోరికలు! ఎక్కడ సాగుతాయి? అక్కడ ఉంటిస్తే కోరాము ణేలు పడుతారు? డబ్బుని సభ్యత్వం కొనుక్కోడం పెట్టి చెయ్యడానికీ, మిట్టినడానికీనా! పెట్టుబళ్ళేనాడక్కలా! పురజనానికి ఉండే ఉమ్మడి ఆస్తులు లాగే లెదు: రోడ్లు కోటలు పందిళ్ళు భవనాలు వీధులు బయళ్ళు మొదలైన భూమి-కాలవలు మురుగు కాలవలు చెరువులు నూతులు వర్షగాలలోని జల -ప్రాణం తీసే శత్రుత్వమే కాని స్నేహవృత్తులు లేని దీపాలు-వీటిల్లోంచి గుణవృద్ధిగా బయటకే సువాసనలోనూ, రోమల్లోనూ ఉండే వాయువు- ఊరు టి కొంతమేరవరకూ కూడా ఆకాశం! ఇల్లాగా పంచభూతాత్మకం! ఇటువంటి ఉమ్మడిఆస్తిని జనం తరఫున రక్షించి ఉద్ధరించడానికి డబ్బు కావలసి ఉంటుంది గనక అది పురజనం దగ్గిర్నించి పన్నులరూపంగా వసూలు చెయ్యడవు విషయంలో పురపాలకవర్గంలో సభ్యులు ఒక్కొక్క అన్నట్టు కలిసి పోతారు. ఇది తప్ప బహుశా అంతా కలిసే విషయం మరోటి ఉండదు. అక్కర్నించి నిష్కామకర్మలో చెయ్యవలసిన వ్యయంగురించి వర్గంలో పార్టీలు పుట్టడం, ఆపార్టీలు రెండుకంటే ఎక్కువ కాకుండా చెయ్యడానికి తడియత్నాలు జరగడం! వాటిల్లో చిన్నపార్టీ ఏదో, పెద్దపార్టీ ఏదో తేల్చడానికి బ్రహ్మశక్యం కాకుండా ఉండడం! ఎంచేతనంటే, చిన్న పార్టీలానే కనిపిస్తూ కన్నుమూసి తెరిచేసరికి అది

అంబసీలుత్రోకలాగ పేలిపోయి కనిపించడం. మరోటి మ్యాంచి మేతమేసిన పెద్దపార్టీలానే కనపడుతూ పనం అలా వెళ్లి ఇల్లా వచ్చేసరికి కల్యాణకొష్టంగా శుష్కించిపోడంజరుగుతూంటాయి! ఇక అంత చాంచల్యంగల పార్టీల్లోని సభ్యులు అదృష్టవశంచేత పురం పాలించడం ఎరిగినవాళ్ళో, ఒకవేళ పురం పాలించడం అనేది వీళ్ళ ప్రయత్నంచేసి తెలుసుకున్నా ఆ ఒక్కటీమాత్రం ఎప్పుడు పడితే అప్పుడు చటుక్కున మరిచిపోగల ప్రజ్ఞ ఉన్నవాళ్ళో, తమనివాళ్ళల్ని గురించిన బాధనలు మాత్రం బోధపడి తమ బాధ్యతలగురించిన నియమాలు అవగాహన కానివాళ్ళో, జబ్బపుష్టీ శరీరదార్ఢ్యమూ కలిగి ఏదేనా కుర్చీలాంటిది ఎదటివాడిమీద విసరవలిసొచ్చినా, అవతలవాడు చిన్నకోనుబల్లలాంటిది తమమీద గిరవటేసినప్పుడు కాసుకోవలిసొచ్చినా సామర్థ్యం, నేర్పు, సాహసం, స్ఫూర్తీ కలవాళ్ళో అయినా, పురజనానికి బొందెతోనే మోక్షం? ఒకే శరీరంయొక్క కాలు తలని తన్ని, నోరు చేతిని కరిచి, వేలు కన్నొడిచి, చెయ్యి పొట్టని గుద్ది వ్యవహరించేటప్పుడు ఆ శరీరాన్ని పాలించడం కష్టమా, కష్టతరమా! అల్లానే పురపాలన కూడా చాలా కష్టం? పురం అంటే శరీరం కూడానూ!

(8) ఇది యంత్రయుగం. జీవితసౌకర్యాలనిమిత్తం దినదినమూకూడా కనిపెట్టబడేయంత్రాలకి హద్దులేదు ఎటొచ్చీ అవన్నీ జనానికి అందుబాటులోకి వచ్చేసరికి ఆలస్యంఅవుతూ ఉంటుంది. అవికాక చంద్రుడియొక్క ప్రతిబింబం భూమిదగ్గిర్నుంచి ఇరవైఅయిదుమైళ్ళ దూరంలో మాత్రమే పడేటట్టు

యొక్క స్వప్నాలోక వచ్చిన సంగతులకి 'మారుపు' అనేదే
ఉండదేమో! పైగా:— ఇటువంటి రకమే నిద్రపోతూన్న
వాళ్ళచేత స్వప్నానుభవ సారం చెప్పించగల యంత్రం
వచ్చినా బాగానే ఉండును గదా అని పరితపించే మేష్టర్లు
ఉంటే ఉండవచ్చు. వాళ్ళ దగ్గరకి ప్రస్తుతం అలాంటి యంత్రం
రాలేదు కనక మన సానుభూతి. ఆ యంత్రంకూడా వస్తే
వాళ్ళకి మన ధన్యవాదాలు!

9. అతీతులైనవాళ్ళకి పవిత్రాపవిత్రాలంటూ ఉండవు గాని, అల్పులకి ఉంటాయి. అందులోనూ కొందరు పవిత్రమని ఎంచే దాన్ని మరొకొందరు అల్పులు అపవిత్రం అని ఎంచడం చాలాసార్లు జరుగుతూంటుంది. మనుష్యులతోపాటు భాషలూ అల్లాగే అయినాయి, వాటికే మొచ్చిందో! చూడండి. 'పాక్' అంటే ఒక భాషలో 'పవిత్రం', 'ఇస్తాన్' అంటె 'స్థానం' అని అర్థాలు! అటువంటి పవిత్రస్థానాన్ని ఆ భాషలో ఉచ్చారణ చెయ్యగానే మరోభాషలో అర్థం పవిత్రం కాకపోడం సరిగదా కేవలం అపవిత్రంగాకూడా ఉంటూండడంచాలా శోచనీయం. భాషల ఘోషవల్ల ఎన్ని మారాముళ్ళనుకున్నారు, దిక్కుమాలిన మారాముళ్లు!

10. మరొక్క సంగతి. ప్రస్తుతం యుద్ధం ఆగి, శాంతి సూర్యోదయం అవడానికి అరుణోదయం అయిందని యుద్ధనేతలు సెలవిచ్చారు. యుద్ధం ఆగిపోడం మూడు మోస్తర్లు:—ఒకటి: ఒకరు కాళ్ళు అప్పగించగా రెండోవాళ్ళు కాళ్ళబేరానికి రావడం! రెండు: కొట్టుకునేవాళ్ళకి విసిగెత్తిపోడం! లేక, మూడు: యుద్ధానికే విసిగెత్తి అది ఏ అంగార

కుడులోళ్లో లేచిపోడం! ఏ విషయంలో నూరుశాతం జోస్యం చెప్ప
డం కొంచెం ఇబ్బంది. అందులో ఎటేనా సంభవానికి మొందే
స్పష్టాధారపడాల్లో జోస్యం చెప్పడం మరి కష్టం! అయినా
సాహసించి ఇల్లా చెప్పవచ్చు: చాలాభాగం ఈ సంవత్సరంలో,
ఇంకా ఏమన్నా సశేషం ఉంటే వచ్చే ఏప్రిల్ నాటికి యుద్ధం
ఖీదాగా ఆగిపోతుంది! 'ఎల్లా చెప్పగలవు? ఒక వేళ ఆగక
పోతే!' అని ఎవరికేనా సందేహం కలగవచ్చు. ఒక వేళ ఆగక
పోతే, ఏమీండి. దానిమాట దానికే ఉంటుంది! మామ్మ
భయాన్ని చెప్తాం! కాళ్ళావేళ్ళా పడి బతిమాలుతాం! నోరు
నొప్పి బాదుకుని కేకలేస్తాం! 'విమానం' రోజులు గనక
ఒకళ్లమాట ఒకరు తోసెయ్యడం మామూలైనా, యుద్ధం
అనేదానికి ఏమాత్రం ఆలోచన ఉన్నా మనం చెప్పేది మనకు
అది ఆగాలి, ఆగితీరాలి! ఒక వేళ ఏప్రిల్ కిమించి సాగితే,
ఎందుకు ఆగలేదో జాగ్రత్తగా గమనించి తరువాత కూడా ఖచ్చి
తంగా యుద్ధాన్ని ఆగమందాం! ఆపళంగా వచ్చే ఏప్రిల్
తరవాత విధాయకంగా ఆగుతుందా, ఆగిపోతుందా!
ఈలోపుగా 'పోస్టువార్'—ఇక్కడ ఎవరేనా పోట్లాడుతున్నా
రేమో! వారిని గురించి కాగు—యుద్ధానంతర పునర్నిర్మాణ
కార్యక్రమాలు మహామహులు సేవస్తున్నారు. [illegible]గాలు,
రోడ్లు, కాలవలు, మురుక్కాలవలు అన్నీకలసి ఎంతో
బాగుపడి కలియుగ చిహ్నాలు యావత్తూ పోయి కలియుగాంతం
అవుతుందన్నారు. మరి బుద్ధిపూర్వకంగా చెయ్యాలంటే కొత్త
యుగం తయారు చేస్తారు గనక వచ్చేయుగం 'కృతయుగం!'
పోస్టువార్లో గౌరవపతవులకి ఇప్పుడు మొట్టమొదట లాభాల

పంట స్థలాలు పెరుగుతుందనీ, సాలీనా సరిపడ వస్త్రాలిస్తుందనీ చెబుతున్నారు. కాని ఎవడూ ఏమీ బుట్టల్లో పెట్టి ఇంటికి దాచటం చెయ్యక్కర్లేదా లుండవట. ఎక్కువ తిని జబ్బు చేయించుకునే అన్నం అక్కర్లేదనే వాళ్ళచేతగూడా బలిమిని తినిపించగలరు గనక వ్యాధులుండవన్నారు. ఖర్చుబిల్లుమాట ఏమిటయ్యా అంటే, ప్రతివాడూ ఏదో చెప్పినపని చేసి ఆర్జించి ఇంటో యిచ్చినట్టే ప్రభుత్వానికి చెల్లగట్టడమే! ప్రయాణాలెల్లా గయ్యా, బంధువులు ఎల్లాగయ్యా అంటే, పైరీతిగా భోజనం దొరకేటప్పుడు ప్రయాణాలే ఉండవు గనక బంధువులు రావడానికివీల్లేదంటారనిఅనుకుంటున్నారు. కార్యాలు రాగులవాటేమిటీఅంటే, రోజూ అందరూ కలిసి భోజనం చెయ్యడంగనక ఏరోజున ఎన్ని పెళ్ళిళ్ళయినాసరే అంటున్నారు. ఇంక ప్రతీ వ్యక్తి ఏకచదువుకోవడమూ, తెగ ఉద్యోగం చెయ్యడమూ తప్ప, మరోటి ఉండడానికి వీల్లేదంటున్నారు. ఆరీతిగా అనారోగ్యమూ, అనైశ్వర్యము మాయంకాగా ప్రస్తుతం ఉండే చాలా ప్రభుత్వశాఖలు అనవసరం అయి చదువుతున్న జనం మిగిలిపోగా వాళ్ళందరిచేతా అజ్ఞాననాశనశాఖలోనే పనిచేయించి భూలోక జ్ఞానంయొక్కతరం లేవగొట్టి పారేస్తారని తెలుస్తుంది. ఇప్పుడు పోస్టువార్ ఆలోచన్లు చేస్తూన్నట్టుగానే రేపు పీస్‌పత్రసంతకం అయింది మొదలు (ఈ మాటు పీసు ఇప్పటి వాట్లాంటి పీసే!) ఏవరేనా 'పోస్టుపీస్!' ఆలోచన్లు మొదలెడితే వాళ్ళకి గట్టిశిక్ష ఉంటుందనికూడా చెబుతున్నారు! సెలవు దయచెయ్యండి!!

సంపూర్ణము